

చాముండీ కొండపై గల
మహిషాసుర విగ్రహము



బృందావన్
గార్డెన్స దృశ్యము

—By S. T. Arasu



# 1898-1958



## ఆయుర్వేదాశ్రమం

# వజ్రానందోత్సవము

### అర్పణ

మా వజ్రోత్సవ శుభసమయమున మా సంస్థ పాలకవర్గము వ్యాధిపీడితులగు మానవాళికి తమ సేవల పునరంకితము చేయుచూ, ఈ సంస్థ వ్యవస్థాపకులు కీ॥ శే॥ పండిట్ డి. గోపాలాచార్యులు గార్లను, పండిట్ డి. దేశికాచార్యులు గార్లను అనుసరించిన ఉదారాశయములనే, శ్రీ ధన్వంతరివారి ఆశీస్సులతో 1898 నుండి నేటివరకు నడచిన తీరునే నడుపగలమని యెల్లరకు హామీ యిచ్చుచున్నాము.

ఈ ముఖ్య సమయమున వజ్రోత్సవమునకు అధ్యక్షత వహింప సాదరముతో అంగీకరించి, తమకు ఆయుర్వేదముపైగల అపార ప్రేమాతిశయమును ప్రకటించిన శ్రీ శ్రీ మైసూరు మహారాజావారికిన్నీ, భారతదేశమంతటను, విదేశములందును గల పౌరులు, వైద్యులు, ఔషధ విక్రేతలు, ఖరములు, అశేష వర్తక ప్రముఖులు, పంపకముదార్లకున్ను తమ కృతజ్ఞతాభివందనము లర్పించుచు, ఇప్పటి వలెనే ఇకముందుగూడా వీరందరు తమకు సహాకరింతురని పాలక వర్గమువారు ఆశించుచున్నారు.

# ఆయుర్వేదాశ్రమమ్, మద్రాసు - 17.

ఈ క్రింది ప్రఖ్యాత ఔషధముల తయారు చేయువారు :

## జీవామృతం     అరుణ     బాలప్రాన



ఈ నెల 13న హైదరాబాదులో, 15న మద్రాసులోను నీగ్రో ఆధ్యాత్మిక కీర్తనలుపాడి కచ్చేరీలు జరుపనున్న అమెరికన్ గోల్డెన్‌గేట్ క్వార్టెట్ (గాయకబృందం) పైన ఎడమనుంచి: ఆర్లాండస్ విల్సన్, జె. సి. గిన్యార్డు, క్రింద: క్లైడ్ రైట్, క్లైడ్ రిడిక్

నవ్వనివారిని నవ్వించి వినోదంకోసంచూచినా
విజ్ఞానాన్ని కలిగించే సరసమైన సాంఘిక చిత్రం

డిశంబరు

# 17

మొదలు

ఆంధ్రప్రదేశమంతటా




జయంతి పిక్చర్సు వారి

# పెళ్ళినాటి ప్రమాణాలు

నిర్మాత - దర్శకుడు . కే. వి. రెడ్డి B.Sc.(HONS)

వాహినీ విడుదల

హైదరాబాద్, తెలంగాణాలకు : నవయుగ ఫిలిమ్స్, సికిందరాబాద్







వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాంటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౩౭] డిసెంబరు 1958 [సంచిక ౧౨

# విషయ సూచిక



ముఖచిత్రము :

జయంతి పిక్చర్స్‌వారి 'పెళ్ళినాటి ప్రమాణాలు'లో

శ్రీమతి రాజసులోచన



—o—



Grihalakshmi Dec. '58.





చాముండీశ్వరి ఆలయపు ఉన్నత గోపురము



చాముండీ కొండపై గల నందీశ్వరుడు

—By S. T. Arasu




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# యుగధర్మాని కనుగుణమైన జీవితం

విజ్ఞాన, సాంకేతికాది శాస్త్రరంగాలలో అభివృద్ధి సాధించబడుతున్న ఆధునిక ప్రపంచములో వెనుకబడకుండా అభివృద్ధి అభ్యుదయాలను సాధించాలంటే ఇండియా తదనుగుణంగా తన విధానాలను మలచుకొని పురోగమించడం అత్యంత అవసరమని ప్రధాని నెహ్రూ ఢిల్లీ విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసములో ఉద్బోధిస్తూ 'కాని యీ కృషితో మానవునికి నాగరికతకు, మనుగడకు ప్రాణప్రదములైన ప్రాథమిక సూత్రాలను, విలువలను అది విడనాడితే మాత్రం ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నట్లే కాగలద'ని హెచ్చరించాడు.

మానవావసరాలైన శాంతి భద్రతలు, సౌభాగ్యము అభివృద్ధి, అభ్యుదయాలకు చిహ్నము. వానిని సమకూర్చలేని విజ్ఞాన, సాంకేతికాది శాస్త్రరంగాలలో సాధించబడుతున్న అభివృద్ధి నిరర్థకము కాగలదు.

వసుధైక రాజ్యస్థాపన యీనాటి అనిశ్చిత పరిస్థితులను, పరస్పర ద్వేషభీతాహములను తొలగించగలదు. విజ్ఞాన, సాంకేతికాది శాస్త్రరంగాలలోని అభివృద్ధి దుర్వినియోగం కాకుండా యుండాలంటే వసుధైక రాజ్యస్థాపన ద్వారానే ఉమ్మడి శ్రేయోసౌభాగ్యముల నుద్దేశించి కృషి జరుగుట కవకాశములు కలవు.

కేంద్ర వ్యవసాయ శాఖామంత్రి శ్రీ పంజాబ్ రావు దేశ్ ముఖ్ చెప్పినట్లు మన ఆలోచనలు, ఆచరణలు వాస్తవికతకు దూరమగుతున్నప్పుడు మానవుని నాగరకతకు, మునుగడకు ప్రాణప్రదములైన ప్రాధమిక సూత్రాలకు, విలువలకు అనుగుణమైన కృషికి, సేవకు అవకాశములు బహు కొద్దిగా మాత్రమే కనుపించుచున్నవి. ప్రజల ఆలోచనలు వక్రగతి ననుసరిస్తున్నప్పుడు దేశసౌభాగ్యమును గురించిగాని, ప్రపంచశాంతి సౌభాగ్యములను గురించిగాని స్వతంత్రంగా ఆలోచించడానికి, వానికనుగుణ్యంగా జీవయాత్రను తీర్చి దిద్దుకోడానికి తాము ఏపాటి అభ్యుదయ పురోభివృద్ధులను సాధిస్తున్నది పారచూచినచో యీ నాటి కల్లోలిత ప్రపంచములో మానవ శ్రేయస్సు అనిశ్చిత స్థాయిలో నున్నది గుర్తించవచ్చును.

మానవుడు తన బాధ్యతలను విస్మరించి చేసే ఏ కృషియైనా, ఏ ఆలోచన అయినా ప్రమాద భరితమేకాగలదు. సాంఘిక వ్యవస్థను ఉమ్మడి శ్రేయో సౌభాగ్యముల నుద్దేశించి రూపొందించడం పూనుకొనినప్పుడే విజ్ఞాన, సాంకేతికాది శాస్త్రరంగాలలో సాధించబడే అభివృద్ధి సుస్థిరమైన శాంతియుత వాతావరణంలో ప్రజాభ్యుదయమును, సౌభాగ్యమును సమకూర్చగలదు.

అది శరవేగంగా సాధించడం సులభం కాకపోయినా మానవుల మానసిక పరివర్తనకు అవకాశముల విస్తృతం చేయడంవలన ఏనాటికైనా సాధ్యము కాగలదు; అది వాంఛనీయము కూడాను.



తరగతిలో పాఠంచెప్పుతూ "సివిల్ వార్ ఎవరెవరికి ఎక్కడ జరిగిందో చెప్పగలవా" అని పాఠం వినకుండా పరధ్యాన్నముగానున్న సుబ్బారావు నడిగాడు.

సుబ్బారావు గభాలున లేచి "మా యింట్లో నాకు, మా అక్కయ్యకు జరిగిందండీ!" అన్నాడు తడుముకోకుండా.

బొడ్డుపల్లి కృష్ణావధాని

# ఉప్పు వృత్తాంతం

—— (౦) ——

## 34 మూలపదార్థాలు కలిగి 14000 ఉపయోగాలిచ్చే ప్రకృతి వరప్రసాదం

—— ౦ ——

పద్రుచులలో లవణం ఒకటి. మానవుడికి తెలిసి నంతవరకు ఉప్పువల్ల 14000 ఉపయోగాలున్నవి. వైద్యంలో సీరం (ఇన్సూలిన్) తయారు చేయటంలో, ఇతర ఔషధాలు తయారు చేయుటంలో ఉప్పు ఎంతగానో ఉపకరిస్తుంది. ఆహారం నిల్వచేయటానికి, అంసం శుద్ధి చేయటానికి, కూరగాయలు నిల్వచేయటానికి ఉప్పు ఉపయోగపడుతుంది. పరిశ్రమల్లో దీనివల్ల బహుముఖ ప్రయోజనాలున్నవి. సబ్బులు, ప్లాస్టిక్ పదార్థాలు, వస్త్రాలు, బ్లీచ్ పేపరు వగైరా తయారు చేయటంలో ఇది బాగా ఉపయోగ పడుతుంది. ఆవు బాగా పాలివ్వాలంటే ఉప్పు వేయవలసిందే. ఉప్పు కలపందే అన్నం రుచించదు.

అంతేకాదు, చరిత్రలో ఉప్పుకు చెరిగిపోని స్థానం ఉన్నది. ఉప్పుమీద పన్ను యుద్ధాలకు దారి తీసింది. మహోద్యమాలు నడచినవి. మహాత్మా గాంధీ నడిపిన ఉప్పు సత్యాగ్రహం భారత స్వాతంత్ర్యానికి ముఖ్య సోపానమయింది. ఉప్పు పండే ప్రాంతాలలోనే మహా నగరాలు వెలసినవి.

అనేక దేశాలలో ఉప్పు మారకపు వస్తువుగా వినియోగపడింది. ఉప్పులేనిదే మానవుని మనుగడ అసాధ్యం. జంతుకోటి జీవించలేదు.

అమెరికాలో యూటా రాష్ట్రంలో పెద్ద లవణ సరోవరం ఒకటి ఉన్నది. ఇది 75 మైళ్లు పొడవు, 50 మైళ్లు వెడల్పు విస్తరించి ఉన్నది. దీన్నే గ్రేట్ సాల్ట్ లేక్ అంటాను. ఇది ఒక సముద్రంలాగా ఉంటుంది. విచిత్రమేమిటంటే ఈ సరోవర జలంలో సముద్రపు నీటిలో కంటే ఎనిమిది రెట్లు అధికంగా ఉప్పు ఉన్నది. ఉప్పు తేలిక పదార్థం కాబట్టి, ఆ సరస్సులో పడ్డవారెవ్వరూ మునగరు.

ఈ సరస్సులో 500 కోట్ల టన్నులు ఉప్పు ఉన్నదని భూగర్భ శాస్త్రజ్ఞులు లెక్క కట్టారు. అంటే వెయ్యి సంవత్సరాలపాటు ప్రపంచం అంతటికీ ఇది సరిపోతుందన్నమాట. కొండ వాగుల గుండా వచ్చే నీరూ, మంచు కరిగిన నీరూ ఈ సరస్సులో పడుతుంది. కానీ ఈ నీరంతా వెంటనే ఆవిరిగా మారిపోతుంది, ఈ సరస్సునుంచి బయటకు నీరు వెళ్ళేమార్గమే లేదు

పూర్వంలాగా గాక ఉప్పు తయారు చేయటంలో ఇప్పుడు ఇక్కడ కొత్త పద్ధతి ఉన్నది. ఒక పెద్ద లవణ "క్షేత్రం" నిర్మించారు. రైతులు పంటలు పండించినట్లే ఉప్పు రైతులు ఉప్పు పండిస్తారు. వసంతఋతువులో ఉప్పు సరస్సునుంచి నీళ్లు తోడి మళ్ళకు పెడుతారు. వేసవి ఎండలకు ఆ నీరు ఎండుతుంది. శరదృతువులో మళ్ళలో ఉప్పును ఫాక్టరీలకు తీసుకుపోతారు.

సరస్సుకు పెద్ద పంపులు పెట్టి నీళ్లు తోడతారు. ఆ పంపులు నిమిషానికి 10,000 గాలన్ల నీరు తోడివేస్తవి. గొట్టాలద్వారా సరస్సుకు నాలుగు మైళ్ళ దూరంలోని ఉప్పు మళ్లలోకి నీరు ప్రవహిస్తుంది. ఈ మళ్లలో నీరు వేసవి కాలంలో ఆవిరైపోతుంది. మళ్ళలో నీరంతా ఆవిరై పోగానే శుద్ధమైన ఉప్పు బయట పడుతుంది.

తర్వాత మళ్ళలోని ఉప్పుతీత ప్రారంభమవుతుంది. కొండశిలల మాదిరిగా ఉండే ఉప్పు మళ్ళలో ట్రాక్టర్లతో దున్నుతారు. ఈ నాగళ్ళ వెనుక నూర్పిడి యంత్రం ఉంటుంది. ఈ యంత్రం తడవకు 700 పౌన్ల చొప్పున ఎత్తి, కుప్పలు పోస్తుంది

మళ్ళలోనే ఈ రాసులు కొన్ని నెలలపాటు ఉంచుతారు. తర్వాత కార్లలో ఫాక్టరీలకు గొనిపోతారు. ఆ ఫాక్టరీలలో ఉప్పులోని నెమ్ము తీసివేసి గుండ్రంగా తిరిగే పీపాలలో పోసి చల్లబరుస్తారు. తర్వాత దీన్నంతా ఒక రోటరీ డ్రయర్ లోకి పంపుతారు. అందులోని మంటలు ఉప్పులోని తేమను పీల్చివేస్తవి.

ఇదంతా అయిన తర్వాత ఉప్పును బాగా నలగ త్రొక్కి జల్లెడపడుతారు. అవసరమైన ప్రమాణంలో కల్లుగా తయారు చేస్తారు. ఆహారం నిల్వకు ఉపయోగించే ఉప్పుకు అయోడిన్ కలుపుతారు. పశువులకు వేసే ఉప్పుకు కాల్షియం ఫాస్ఫేటు కలుపుతారు. ఇది ఉప్పు వృత్తాంతం.

---

## ఉత్సవాలు, వినోదాలు

ఈ నెల 6-వ తేదిన మద్రాసు ఆయుర్వేదాశ్రమం రతోన్మత్సవము అత్యంత వైభవోపేతంగా మైసూరు మహారాజావారి అధ్యక్షతన జరిగింది.

ఆయుర్వేదాశ్రమం వ్యవస్థాపకులు పండిత గోపాలాచార్యులు ఆయుర్వేద వైద్య విద్యావిధాన వ్యాప్తికిగాను చేసిన పరిశోధనాత్మక, నిర్మాణాత్మక కృషిని అధ్యక్ష పీఠమునుండి మహారాజావారు, శ్రీ సి. జి. శాస్త్రి, శ్రీ వి. వి. గోపాలరత్నంగారలు తమ ఉపన్యాసములలో కీర్తించి వివిధ వ్యాధులతో బాధపడుతున్న మానవ లోకానికి తమ కృషిద్వారా, మందులద్వారా చేసిన సేవ అమోఘమైనది, అమూల్యమైనదని అన్నారు.

ఆయుర్వేదాశ్రమం పరిపాలకవర్గం తరఫున డాక్టరు గోపాలాచార్యులు మహారాజుకు సమర్పించిన స్వాగత పత్రంలో తమ పెదనాయన వైద్యరత్న పండిత గోపాలాచార్యులు ఆయుర్వేదాధ్యయమును మైసూరులో గావించి, ఆయుర్వేద కళాశాలకు 35000 రూపాయలు విరాళమిచ్చిరనియు, మైసూరు రాజ వంశము యొక్క ఆదరాభిమానములు అనాదినుండి తమకు లభ్యము కావడమునకు తాము సర్వదా కృతజ్ఞుల మనియు, పండిత గోపాలాచార్యులు, తమ తండ్రి శ్రీ దేశికాచార్యులుగార్ల అడుగు జాడలలో వైద్య రంగంలో శక్తి వంచన లేకుండా తాము చేయగలమనియు వివరించారు.

శ్రీ సి. జి. శాస్త్రిగారు తాము ఆయుర్వేదాశ్రమం ప్రైవేటు లిమిటెడు వారి మందులకు మైసూరు సోల్ డిస్ట్రిబ్యూటర్ గా అభినందిస్తూ రజత పేటికను బహూకరించారు.

మంగళ వాయిద్యములతోటి, కుమారి వైజయంతిమాల నృత్యముతోటి, అతిథి సత్కారముతోటి రతోన్మత్సవము కనుల పండుగగా నుండినది.

♦ ♦ ♦

మద్రాసు చిల్డ్రన్ గార్డన్ స్కూలువారు డిశంబరు 6వ తేది నాడు స్కూలు బిల్డింగ్ నిధికిగాను ఏర్పాటు చేసిన నృత్య, నాటికల ప్రదర్శనము మనోజ్ఞముగా నుండినది. విద్యాలయ నిర్వాహకులు డాక్టరు వి. యస్. శర్మ దంపతుల అచంచల దీక్షా, కృషిఫలితంగా వర్ధిల్లుతున్న విద్యాలయము మరింతగా అభివృద్ధిగాంచగలదనడానికి యీ ప్రదర్శనము నిదర్శనము. ఈ ప్రదర్శనము విజయవంతం కావడానికి బాల బాలికల ఉత్సాహాసక్తులు, ఉపాధ్యాయ వర్గంయొక్క సమీకరణ, శక్తి సామర్థ్యాలు ప్రశంసనీయములు.

తెలుగు, తమిళ భాషలలో సమానముగా విద్యావకాశములను సమకూరుస్తున్న యీ విద్యాలయము మద్రాసులో పరస్పర సహకార, సద్భావములను పెంపొందచేయడానికి విశేషముగా తోడ్పడగలదు. ఈ విద్యాలయము మద్రాసులోని తెలుగువారల ప్రోత్సాహమునకే కాక మద్రాసేతర ఆంధ్రుల సహాయమునకు నోయితము పాత్రమై వర్ధిల్లవలసియున్నది.

---

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డె సయంట్-ఎక్స్‌ప్యూపేరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



(గత సంచిక తరువాయి)

["రాజకుమార్" కథానికను శిల్పించిన రచయిత యుద్ధపురోజుల్లో పైలట్‌గా పనిచేస్తూవున్నకాలంలో ఆయన ప్లేన్ ఆఫ్రికా ఎడారిలో వెడుతూ, ఇంజన్ చెడిపోయినందుమూలాన క్రిందికి రావాలసివచ్చింది. అలాటి సమయంలో ఆయనకు రాజకుమార్‌ని కలుసుకునే అదృష్టం సంభవించింది. ఆ అబ్బాయి మరోగ్రహమండలంలోనుంచి వచ్చిన అబ్బాయి. ఆ అబ్బాయితో పరిచయంకలిగినప్పటినుంచి అబ్బాయి లోకాన్ని గురించి ఎన్నెన్నో అద్భుత విషయాలను అవగాహనం చేసుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూవున్నాడు ఈ రచయిత. ఇక చదవండి.]

## అబ్బాయి లోకపు దివ్యదృశ్యాలు!

మా రాజకుమార్ అలసి నిద్రపోతున్నాడు. ఆ నిద్రలో ఎన్నెన్నో కమ్మని కలలని కంటున్నాడు. ఆ అమాయకపు ముఖమండలంలో అబ్బాయి తన్మయావస్థనంతా తేటతెల్లంగా అవగాహనంచేసుకోటం అంత కష్టమైన పనికాదు. నా దృష్టి అంతా వాడిమీదే! వాడు వచ్చిన ప్రపంచంమీదే!

మా రాజకుమార్‌కి పూలంటే ఎంతో ఇష్టం. వాటిని గురించి ఎన్నెన్నో కథలను, గాథలను చెప్తూవుండేవాడు ...

మన లోకంలో పూలమొక్కల్ని నాటి ఎరువువేస్తూ, నీరు కట్టుతూ, కంచెలని నాటుతూ వాటిని జాగ్రత్తతో చూసుకుంటూవుండాలి. రాజకుమార్ చెప్పేమాటలనిబట్టి వాడి లోకంలో పూలమొక్కలు పెరగటం ఎంతో సులభం. ఆ మొక్కలూ, మన మొక్కలికి మల్లె చిన్నవై తేగా! భూమిలోనుంచి మొలకలెత్తినవాటిని ఎవళ్లూ చెడగొట్టరు. అంచేత ఆ మొక్కలు తిన్నగా చక్కగా ఎదుగుతాయి. వాటి పూలకాంతి సూర్యోదయంతో ప్రారంభమవుతుంది. సూర్యాస్తమయంతో నిద్రావస్థలోకి దిగుతుంది. ఒక పూలమొక్కకూ, మరో మొక్కకీ ఎంతో తేడా. వాటిని పూలమొక్కలని అనటానికన్నా పూలచెట్లని పేర్కొనటం మంచిది. అబ్బాయి వివరించే వివరాలనుబట్టి ఆ పూలచెట్లూ బ్రహ్మాండమైనవి. వాటిలో కొన్నిటికి వాడి లోకాన్నంతా ఆక్రమించుకోటానికి కావలసిన శక్తి సంపదలు వున్నాయికూడా! ఇలాటి మొక్కల గురించి అబ్బాయికి బాగా తెలుసు. ఆ మొక్కల్లో ఎన్నెన్నో జాతి మొక్కలు

వున్నాయి. వాటిరంగులుకూడా వాటివ్యక్తి స్వాభావసిద్ధంగా వుంటాయి. ఎక్కువ ఎండ తగులకూడదు. ఎక్కువచలి తగులకూడదు. ఎక్కువగాలికూడా తగులకూడదు. అలాటి రంగుల మొక్కల్ని పెంచి పోషించేటప్పుడు, వాటికేసి వెయ్యి కళ్లతో చూస్తూ వుండాలి...........

ఒక రోజు వుదయాన సూర్యోదయమైందోలేదో అలాటి పూలమొక్కల్లో ఒక జాతిమొక్క ఆవలిస్తూ "ఇంత ప్రొద్దువుతుందని అనుకోలేదే! ... ఇలా చిందర వందరగా వున్నందుకు నన్ను క్షమించాలి. ... తప్పంతా నాదే ..." అని చెప్పుకుంది.

రాజకుమార్ దానికేసి ఆప్యాయంగా చూస్తూ "ఎందుకలా అనటం! నువ్వు చూడటానికి బాగానే వున్నావే!" అన్నాడు.

"నిజంగానా! సూర్యుడితో పుట్టిన వాళ్లలో ఒకణ్నిగా! అంచేతనే ..." అని ఏమేమో అబ్బాయికి చెప్పబోతున్నది. అబ్బాయి అంటే పూలమొక్కలకుకూడా చెప్పరానంత ప్రేమ. కాని వాటి కోరికలని తూ. చా. తప్పకుండా నెరవేర్చుకోటానికి ఏమాత్రమూ తటపటాయించేవికావు. అవసరంవస్తే మారాం చేయటానికి భయపడేవికావు, ఒక్కొక్కసారి వాటికోరికలని తక్షణమే నెరవేర్చమని ఆజ్ఞాపించేవికూడా!

"అంతా సరేకాని! ఇప్పటికే ఎంతో ఆలస్యమైందే! ... నా తిండీ తిప్పల సంగతి మరచిపోయినట్లు వున్నావే" అని ఆ మొక్క అబ్బాయితో అన్నది.

అవి అలా మారాం చేయడం అంటే అబ్బాయికి ఇష్టం! ప్రక్కనేవున్న చెంబును చప్పున పుచ్చుకుని, నీళ్లతోనింపి పూలమొక్కలకు నీరుపోయటం మొదలు పెట్టాడు...... ...

II

అబ్బాయి లోకంలో పెరుగుతూవున్న పూలమొక్కల పుట్టు పూర్వోత్తరాలు అబ్బాయికి బాగా తెలుసు. వాటిలో కొన్ని పూలమొక్కలకి ఎక్కడాలేని గర్వం. అలాటి వాటిలో అగ్రతాంబూలం రోజాలకు ఇయ్యవచ్చు. రోజాచెట్లకు ముళ్లు వుంటాయికదూ! ఒక రోజున ఆ రోజాచెట్లల్లో ఒక చెట్టు, అబ్బాయి తన దగ్గరకివచ్చి, తన పూలను ఆప్యాయంగా తడమటం చూస్తూ "నా ముళ్లు ఎంత వాడిగావున్నాయో చూడు! పులే నాకేసి వచ్చిందా వీటితో ఏంచేస్తానో చూడు!" అని గర్వంతో అబ్బాయికేసి చూస్తూ అన్నది.

దాని పొగరుబోతుతనాన్ని అణగద్రొక్కటానికి "నా గ్రహమండలంలో పులులువుంటేగా! . అథవా పులులు అనేవి వున్నా నీలాటి ఆకూ, అలాలకేసి ఎందుకు

వస్తాయనుకుంటావు?'' అని సూటిగా అబ్బాయి అన్నాడు.

''ఆకూ అలాల్నే అయితే అలా అనుకోవచ్చు ఏమో'' జంకూ గొంకూ లేకుండా జవాబియ్యటానికి ఆరంభించింది ఆ మొక్క.

ఇంక అబ్బాయి ఏం అనగలుగుతాడు అది అలా అంటూంటే! ''పులులు ఎన్ని వచ్చినా రానియ్యి. వాటిని చూస్తే నాకేం భయంలేదు ..అయినా. సుడిగాలి అంటే హడలిపోతాను. దాన్నుంచి కాపాడటం నీవంతు! ఏమంటావు?'' అని దీనంగా వాడికేసి చూస్తూ అన్నది.

ఈ మొక్కలకు ఎండ బలమున్నా వాటి వేళ్లు మన మొక్కలకు మల్లె అంత లోతుగానాటుకోలేవు. అంచేతనే చిన్నగాలి వచ్చినా కంగారు పడటం వాటికి సహజం. గాలి అంతా ఒక ఎత్తు. ఎలాగో ఒకలాగు గాలికి తట్టుకో గలిగే శక్తివుంది కాని సూర్యరశ్మికి మాత్రం తట్టుకోలేవు ... అప్పటికే బాగా ఎండ కాస్తున్నది. క్రమేణ ఎండకు సొమ్మసిల్లి పోసాగాయి. ''ఏదైనా గొడుగు వుంటే...!'' అని హడలిపోతూ ఒక మొక్క అబ్బాయితో అన్నది.

''కొంచెం ఓపిక పట్టుకోవాలి. ఇప్పుడే గొడుగును తెచ్చి ఇస్తా'' అని అంటూ అబ్బాయి గబగబ ఇంట్లోకి వెళ్ళాడు గొడుగుని పట్టుకుని రావటానికి... ...

రాజకుమార్ తన గ్రహమండలంలో వున్న ఈపూలమొక్కలసంగతి ప్రత్యేకంగా నాకు వివరిస్తూ ''వాటి కష్టనిష్ఠూరాలను చెప్పటానికి ప్రారంభించాయా ... వాటి దగ్గరకు వెళ్లి ఆ కోపతాపాలని వినటానికి బదులు, వాటికి కొంచెం దూరంలో నిలుస్తూ వాటి అందచందాలు చూస్తూ ఆనందించటం, అన్నివిధాలా మంచిదనుకుంటాను. మనల్ని ప్రేమిస్తూవున్న ఆ జాతి పట్ల అలా వుండటం బాగుండదని తెలుసు. అవి పసిపాపలుకావు; వాటిమాటలను వినకుండా వుంటే, వాటంతట అవే ఎదుర్కోవాలసిన కష్టనిష్ఠూరాలను సాహసంతో ఎదుర్కొంటూ వుంటాయి .... ఒకసారి నేనూ సాహసించి అలా చేశాను కూడా. గాలికి, ఎండకు, వానకు తట్టుకోలేక కష్టపడ్డాయి, పాపం! అలాటి పరిస్థితుల్లో ఎలా మెలగాలో బాగా నేర్చుకున్నాయి. అయినా అలా వాటిని చేయనిస్తానా? అవి నా ప్రాణాలు 'నా ప్రాణాని కన్నా ఎక్కువగా ప్రేమించటం అలవాటయిపోయింది,' అని కంటతడి పెట్టుకుంటూ రాజకుమార్ అన్నాడు.

అబ్బాయి గుండె అంత సున్నితమైంది. ఇటువంటి వాళ్లు మన లోకంలో కలికానికైనా కనబడతారా? వాడి గ్రహమండ

లంలో ఒక విధమైన ప్రత్యేక వ్యక్తిత్వం వుండాలి. ఇలా ఎడారిమధ్య ఏకాకిగా వుండిపోవాలసిన నాకు ఈ అబ్బాయితో పరిచయం కలగటం నా అదృష్టభాగ్యం. నా బాధను అబ్బాయి అవగాహనం చేసుకునే వుండాలి. లేకపోతే అంత కలుపుగోలు తనంతో నా దగ్గర ఎందుకు వుంటాడు? అస్తమానమూ, తను వచ్చిన ప్రపంచం సంగతే అంత ఆప్యాయంగా ఎందుకు చెప్పటం!......

III

అబ్బాయి లోకం ఎక్కడ? నేనున్న ఈ లోకం ఎక్కడ? అబ్బాయిని తదేకంగా చూస్తూవున్నప్పుడు, వాడు తన లోకాన్ని గురించి చెప్పే సంగతులను శ్రద్ధగా వింటూవున్నప్పుడు, నా మనస్సునంతా వుక్కిరి బిక్కిరి చేసే ప్రశ్న - అబ్బాయి తన లోకాన్నుంచి ఈ లోకానికి ఎలా రాగలిగాడనేదే! అడవి పక్షి మీద ఎక్కివచ్చాడా? ... లేక మరి దేనిమీద కూర్చుండి ఇక్కడికి రాగలిగాడు? ... వాడు చెప్పే మాటల్నిపట్టి అక్కడి దేశకాల పరిస్థితులు ఒక ఎత్తు ఇక్కడివి ఒక ఎత్తు. వాడిది మనదానికన్నా చిన్న ప్రపంచం అయివుండాలి. అక్కడి నుంచి బయలు దేరటానికిముందు తన ఇంటిని, వాకిలినీ చక్కగా సర్దివుండాలి. వాడి ఇంటి ఆవరణంలోనే రెండు అగ్నిపర్వతాలు వుండితీరాలి, అవీ ఆ గ్రహమండలానికి తగ్గట్లేవుండాలి. వాడి వంటపనులకు అవి ఎంతో సహాయపడుతూ వుండాలి. అగ్నిపర్వతాలు చిన్నవే అయినా అవి ఎప్పుడూ మండుతూవుండటం వాటికి సహజమేగా! ఇక్కడికి రావటానికి ముందు వాటిని ఆర్పివేసివుంటాడు! లేకపోతే వాటి మూలాన తను అక్కడలేని సమయంలో ఏంప్రమాదం జరుగుతుందో వాడికి బాగా తెలిసే వుంటుందిగా!...

నాతో కబుర్లు చెబుతూ, ఆనందిస్తూ వున్న రాజకుమార్ వాలకం చప్పున మారిపోయింది ... ఇంటి మీద ధ్యాస కాబోలు! ఆ ధ్యాసలో వాడి లోకపు దృశ్యాలే కళ్ళముందర కనబడుతూ వుండాలి!

అక్కడి పూల మొక్కలు వాడ్ని పిలుస్తున్నాయి. "ఆ! వస్తున్నా" అని తనుగారాబంతో పెంచుతూ వున్న రోజా మొక్కకేసి అంటున్నాడు.

అది అబ్బాయి మాటని వినిపించుకుంటేనా! అబ్బాయి "ఇదిగో! కొంచెం ఓపిక పట్టుకో. నువ్వు అలావుంటే ఇతర్లు ఏమనుకుంటారో? ఆ సంగతి తెలుసుకోవాలి" అని ఆవేదనతో అన్నాడు.

అదీ తన కర్తవ్యాన్ని గ్రహించేవుండాలి. "నీ దగ్గర అంత బెట్టుసరిగా

(666-పేజి చూడుడు)

# భ్రమ తెచ్చిపెట్టిన రభస

"ఉదయగిరి"

పైనా క్రిందా మంటలుగక్కే వాతావరణం క్షణంలో చెప్పరాని మార్పు తెచ్చుకుంది. చల్లదనం విద్యార్థుల గదిలోకి ప్రసరిస్తూంది. చల్లగాలితో పాటు మబ్బుసోదలు కమ్ముకున్నయ్. కిటికీ చువ్వల్ని తాకి, హోరుమని లోనికిదూరి, టేబిల్ పైనున్న కాయితాల్ని టపటపమని చిటచిటమని ఎగరేస్తూ పిల్లగాలులు నవ్వుకుంటూ సంబరపడుతున్నాయ్. పిల్లగాలులు తమలో అమాయికంగా కూనిరాగాలు తీసుకుంటున్నాయి. అప్పుడప్పుడు ఆ సంగీతాన్ని క్లాసుకంతా వినిపింపచెయ్యడానికి ప్రయత్నిస్తున్నయ్. దానికి తోడుగా మృదువుతేలి, జారిపోయే నునుపాటి చెక్కిళ్లను నిమురుతూ ముద్దుల వాయించుకుంటున్నయ్! కాటుక రెప్పలు వీటి అల్లరికి చిన్నబోయి చూస్తున్నయ్. వీటి చిలిపిగోలకు యిక తట్టుకోలేక అటు తిప్పుకున్నయ్. బడిపిల్లలకుమల్లే కొంటెగా వెళ్ళి కిటికీ రెక్కల్ని దభేలున కొట్టివచ్చి, ఆమె ముఖాన్ని ఉఫ్‌మని పొగయింజన్లా ఊదింది. వాటి గోలకు అందర్లో ఏదో విసుగు పుట్టిందేమో! అప్పుడప్పుడు వాటికేసి తీక్షణంగా చూస్తున్నయ్ చూపులు!

క్లాసంతా మూగనోము పట్టినట్టుంది. మరి ఎవ్వరు పలకరేం? ఉలకనైనా ఉలకరే!! ఏమిటీ మౌనం? ఎక్కడిదీ ఆ దీక్ష? ఎవ్వరిది ఆ ఆదర్శం? ఎప్పుడైనా యింత శ్రద్ధగా, నిశ్శబ్దంగా ఉండిందా క్లాసు? లెక్చరర్ కిటికీ ఊచల్లోంచి ప్రకృతిలోకి ఒక్కసారిచూసి, మళ్ళా తిరిగి తన ధ్యాసలో పడ్డాడు.

కిటికీ వెనకాల కొద్దిగ అటువైపున్న జానకి కలం ఏదో గీకుతోంది. అప్పుడప్పుడు కరకరమంటోంది. పాళీ పేపరుతో గుచ్చుకున్నందుకేనేమో ఆ విసుగు! ప్రక్కనున్న రవు చాక్లెట్ అంచు తెల్లటిపమిట గాలికి జవాబిచ్చుకుంటూంది. పమిటచెరగు గాలికి వెనకవున్న ప్రభావతికి తగిలిందేమో కన్ను నులుము కుంటూంది. వాళ్లకు 'కార్నర్‌గోల్'లో వున్న విద్యార్థి చూపులు జానకి నొసటిపైన మెరుస్తున్న ఎఱ్ఱటి జ్యోతిమీద కదిలే పిచ్చిపిచ్చి వెండ్రుకల్ని, పచ్చటి ఒంటిమీది ఎఱ్ఱటిగాజుల్ని ఒక్కసారిచూసి, లెక్చరర్ వైపుకు మళ్ళినయ్.

వెలుపల గాలి హోరు! గదిలోపల లెక్చరర్ జోరు! చిత్తచాంచల్యాలకది పట్టిబోరు! కాని, చీకటి కోణాల్లో గది నిశ్శబ్దంగా వింటోంది.

చుట్టు కన్పించే ప్రకృతి అందం అక్కర్లేదా? దాన్లోని ఆనందం పొందను చేతకాదా? ఎందుకు చేతకాదూ? అందరూ 'వరసకవిత్వం' కట్టేవాళ్ళే! ఆ మూలున్న గోపాలం ఊరుకోవున్నాడే? వెంపల్లె వారి విమల తిరిగి చూడదే! గోపాలానికి సందు చిక్కితే చిట్టుక్కుమనకుండా గోడుగోడు మని పిస్తాడే! ఆడపిల్లలపైకి విమానాలు వదలటానికి మంచి అనుకూలం ఇప్పుడే! మసక చీకట్లు ముసిరాయి! పైన మబ్బులు గుత్తిగవున్నాయి. మరి కాటుక చూపులు క్లాసంతా మళ్లించే కమల మళ్ళించదే! తెలుచుగా వాళ్ళిద్దర్నీ చూసి సరదాపడే క్లాసంతా సీరియస్‌గా ఉందే?

ఆకాశంలో హైడ్రోజన్ బాంబు ప్రేలినట్టు ఉరుములు! కుండపోతగా వర్షం! మధ్యలో కొమ్మలు విరిగేగాలి! వణికించే చలి! క్లాసుమాత్రం చలించదే! నీటిధారలమధ్య కమ్ముకున్న చీకటిని ఆసరాగా తీసుకుని మెఱుపులు స్వారిచేస్తున్నయ్! ఉరుములు ఉరిమినా, మెరుపులు మెరిసినా ప్రకృతికేనా?

విద్యార్థుల బెంచీలక్రింద, విద్యార్థినుల బెంచీల క్రింద చీకటి మసకలు చేరకపోలేదు. అందుకనే బెంచీల క్రింద భాగం అస్పష్టంగా కన్పిస్తోంది. పాదాలు మసకల్లో మునిగినయ్!

వెలుపల ఉరుములు! మెరుములు!.. లోపల కొంపలు, దేశం కూలేపిడుగులు!... "కారుచీకట్లు కమ్మినయ్! రహస్యంగా సైన్యాలు హిందూ కోటల్ని ముట్టినయ్. ఆత్మరక్షణకు మన సైన్యం ఎదురైంది. కొరివిదయ్యాల్లా బ్రిటీషు సైన్యం ముందుకొస్తూవుంది! ప్రజల్లో భయం! చీకటి గర్భంలో భయానక దృశ్యం! ప్రళయం! శత్రుసైన్యం..." లెక్చరర్ ఉద్రేకంతో ఇంకా... ఇంకా... విద్యార్థుల్నంతా తన్లోకి ఆకర్షించుకుంటున్నాడు.

ఆ చరిత్రకు కొందరు కంపించారు. కొందరు భయంతో నిండిపోయినట్టుంది. ఆ మూలున్న వాళ్లు చుబుకం క్రింద చేతులుంచుకుని వింటున్నారు. అంతా అయోమయం!

ఆ చీకట్లో ఆమె కాలికి ఏదో చల్లగా తగిలి, మెల్లగా ప్రాకుతున్నట్టుంది. ఆమె శరీరం జలదరించింది. ఒక్కసారి ఆమెను కదిలించివేసింది. చేతిలో వున్న పేనా ఒక్క ఎగురున దూరంగా పడింది... 'పాము — పాము అమ్మయ్యో' అని వెఱ్ఱికేకతో బెంచిమీదికే గెంతి, కిటికీ గుద్దుకుంది జానకి. లెక్చరర్ అప్పట్లో కాస్త చలించాడు. వెంటనే కిటికీ తలుపులు తీశాడు.

ఆమెకు దడ... ఆగలేదు! గుండెల్లో ... ఒకటే దఢా!! అప్పట్లో ఎన్ని నీళ్ళిచ్చినా తాగేసే దడ పరిగెడ్తూనేవుంది. ప్రక్కనున్న కమల గోడకు అట్టే అంటుకుపోయింది. కిటికీ దగ్గరున్న అమ్మాయి వెంటనే జానకిని పట్టుకుంది. ముచ్చెమటలు పట్టాయి. గుండెలు ఎగశ్వాస పీలుస్తున్నాయి. విద్యార్థులప్పట్లో గేలిస్వభావం మాని, సహాయం చెయ్యడానికి ఉరికారు. 'కర్రేదీ, కర్రేదీ' అని ఒకరు. 'చెప్పు అందుకో... చెప్పు అందుకో...' మరొకరు. కిటికీ రెక్కలు తెరుచుకున్నాయి. వెలుతురు మసకగా వచ్చింది. ఏదో పొడుగ్గా క్రింద నల్లగా వంకర టింకరగా కదుల్తోంది. మధ్యమధ్య తెల్లటి మచ్చలు మెరుస్తున్నాయి. ఒక చివర సన్నగా, మరొక వైపు లావుగావుంది. లెక్చరర్ అగ్గిపుల్ల వెలుతురు చూపెట్టాడు. గదంతా ఘుంగారుపెట్టి, నానాగోల, రభస చెయ్యించింది నల్లటి రిబ్బను ముక్క! కిటికీ లోంచి వచ్చేగాలికి యింకా విషసర్పంలాగా కదుల్తూనేవుంది.

ఎగశ్వాస పీల్చే గుండెలు "హా...మ్మ...య్యా..!" అంటూ నిట్టూర్పు విడిచాయి! ఆ నిట్టూర్పులో నిర్జీవ ప్రతిమలాగుండిపోయిన జానకి కాటుక చూపుల్లో చిలిపితనం, పెదవుల్లో సిగ్గుతో కలిసిన చిన్ననవ్వు ఒక్క క్షణం తళుక్కుమన్నయ్! ఇంతకు ముందే తాను తొడమీదుంచుకున్న రిబ్బనే తెచ్చిందీ యీ రభస! తిరిగి జడకు వేసుకుంటూ బెల్ కొట్టిందాకా ఆమె సిగ్గుతో చూపులు ప్రక్క బెంచికేసి నిల్పుకొనుండిపోయింది.

# రాధ

శ్రీ ఎస్. ఎమ్. వాడ్రేవ్

—(०)—

"శంకరం! నీ భార్య నింక తీసుకురావే మిత్రా?" తల్లి ప్రశ్నించింది:

"నేను వద్దన్నా కాని డబ్బాశకొద్దీ నాకా పిల్లను ముడెట్టారు. ఆ పిల్ల మొహం చూస్తే అసహ్యం దానంతటది పుట్టుకొస్తుంది. లోతుకుపోయిన కళ్లు; మొహం నిండా స్ఫోటకపు మచ్చలూను. డబ్బాశ కొద్దీ మీరు ముడెట్టారు కనుక - మీరే అనుభవించండి. నేను తీసుకరాను. ఒక వేళ మీరే కనుక తీసుకువచ్చినట్టయితే దాని మొహం చూడను." అని చీదరించుకుంటూ శంకరం బయటకు వెళ్లిపోయాడు.

"సరే! అదేమిటో నేను చూస్తా."

◆ ◆ ◆

**కాకినాడలో** బాగా డబ్బున్న జమిందారు వెంకటేశంగారొక్కరే. ఆయనకు లేకలేక పుట్టిన ఆడపిల్ల రాధ. అన్నీవుండీ అయిదవతనం తక్కువన్నట్లు రాధకి అందం తక్కువ. అంటే మొహంనిండా స్ఫోటకపు మచ్చలు; కళ్లు లోతుగా నుంటాయి. కూతురు అందంగా లేకపోయినా లేకలేక పుట్టినందువల్ల కొడుకైనా, కూతురైనా రాధేనని చాలా గారాబంగా పెంచి పెద్ద చేశారు, వెంకటేశంగార్కి చదువులేనందువల్ల కలిగే బాధలు ఆయన అనుభవించారు గాబట్టి; రాధని స్కూలులో చేర్పించి స్కూల్ ఫైనలు వరకు మాత్రమే చదివించారు. రాధకి పెళ్లివయస్సు వచ్చింది. పెద్దమనిషి అయింది. రాధకి నచ్చిన పిల్లవానికిచ్చి ఎంతో వైభవంగా వివాహం జరిపించాలని వెంకటేశంగారికి కుతూహలంగావుంది. కానీ పిల్లను చూడగానే వచ్చిన ప్రతీ సంబంధం వెనక్కు తిరుగుతోంది. తల్లిదండ్రులు చాల బాధపడ్డారు. ఎంత డబ్బుంటే మాత్రం కురూపిని చేసుకుందుకు ఎవడిష్టపడతాడు. కానీ, కట్నానికి, పిల్లకి వచ్చే ఆస్థి చూసి ఎవరో ఒకరు చేసుకోపోతారా అని వెంకటేశంగారి గుండె ధైర్యం. ఎలాగయితేనేం సర్వవరంలో శంకరం అనే పిల్లాడికి యివ్వడానికి పెద్దలు నిశ్చయించుకుని తాంబూలాలు పుచ్చుకున్నారు. అల్లుడు మంచివాడు; బి. ఏ. చదువుకున్నవాడు దొరికాడని, రాధ అదృష్టవంతురాలని వెంకటేశం దంపతులు చాల సంతోషపడ్డారు. ఓ మంచి ముహూర్తాన వివాహం ఏ ఆటంకాలు లేకుండా జరిగిపోయింది. శుభకార్యం కూడ జయప్రదంగా జరిగింది. (శంకరానికి రాధంటే యిష్టంలేకపోయినా ఆ సమయంలో తన కర్తవ్యాన్ని నెరవేర్చాడు.)

శంకరానికి ఈ సంబంధం యిష్టంలేదు. తల్లిదండ్రుల నూటిపోటి మాటలవల్ల; డబ్బాశవల్ల మూడు ముళ్ళూ వేశాడు. పెళ్లయిన వారం రోజులనుండి అత్తవారిల్లు చూడనేలేదు. భార్యచిత్రం హృదయంలో మెదిలేటప్పటికల్లా వళ్ళంతా తేళ్లు పాకుతున్నట్టవుతోంది. శంకరానికి మామగారి దగ్గర్నుంచి ఉత్తరాలు వస్తున్నాయి. కాని. జవాబులు వెళ్ళటంలేదు. తల్లిదండ్రులు వెళ్ళమని యింట్లో తెగపోరు పెడ్తున్నారు. భరించలేకపోతున్నాడు. 'అవును-వాళ్ళకేం చెప్తారు-అనుభవించవలసింది నేను' అనుకున్నాడు శంకరం.

'వెంకటేశంగారు తన అల్లుడు రాకపోవడానికి కారణం తెలుసుకోలేక బాధపడుతున్నారు. అల్లుడు రాకపోవడం, రాధ దుఃఖం భరించలేక పోతున్నారు. చివరకు వెంకటేశంగారి అన్నగారి కొడుకు ద్వారా శంకరం వైనం తెలుసుకొని ఎంత బాధపడ్డారో చెప్పతరముకాదు. ఆయన లోపల ఏవేవో అనుకున్నారు. రాధ ఎంత బాధతో కృంగి కృశించి శల్యమయి పోయిందో ఎవరికి తెలుసు? ఒక అమాయకురాలి జీవితాన్ని ఎలా నాశనం చేశాడో వాడు అని లోకం కోడై కూసింది. ''అవును! తనవంటి కురూపిని అర్థాంగిగా చేసుకున్నవాడు ఇంతకంటే మెరుగ్గా ఎలా ప్రవర్తిస్తాడు? అలాంటపుడు వివాహం ఎందుకు చేసుకున్నాడు? యిదేమైనా నాటకంలో ''పాత్ర'' అనుకున్నాడేమో! చూడకుండా చేసుకున్నాడేమో అంటే అలా జరగలేదు చూసే చేసుకున్నాడు. ఇప్పుడున్న అయిష్టం ఆ నాడెందుకు లేకపోవాలి? డబ్బుకి కక్కుర్తిపడి ఒక అమాయకురాలి జీవితాన్ని నాశనం చేయాలనుకున్నాడేమో'' యిలా తనకు తాను ప్రశ్నించుకుంది రాధ.

రాధని అత్తవారింటికి పంపిస్తే కాపురం స్థిరపడుతుందేమోనని అక్కడికి పంపించారు. అక్కడా సుఖంలేదు. భర్తగారి చీదరింపులతో సరిపోతోంది. తన వయసుగల యువతులు వారి భర్తలతో ఎందరు హాయిగా ఉండటంలేదు? శోభనం గదిలో తన కర్తవ్యం తీర్చుకుందుకు రాధ పనికి వచ్చిందన్నమాట. అంటే మగవాళ్లు స్త్రీలయెడ అంత చులకనగా ఉంటున్నారు (ఈ రోజుల్లో). ఒక సంవత్సరం గిర్రున తిరిగింది.

రాధ గర్భవతి అయింది. ఇప్పుడైనా తనను గౌరవంగా చూస్తాడేమోనని చాల సంతోషించింది. తనకు కలుగబోయే శిశువును చూసైనా భర్త మారవచ్చు; యిలాగ ఎందరు మారటములేదు!

రాధకు తొమ్మిదో నెల రాగానే పుట్టింటికి తీసుకువచ్చారు. వచ్చిన మర్నాడే రాధ సుఖంగా ప్రసవించింది. సంతోషంతో

తన భర్తను తలచుకుంటూ బిడ్డకేసి చూచింది. హృదయం బ్రద్దలు అయినట్లయింది. తన మాదిరి ముఖమే! ఏం అనుమానం లేదు, 'ఆడపిల్ల'-ఒక్కసారి తను అరచినట్టయింది. అంతే! శాశ్వత నిద్రలోలీన మైపోయింది అమాయకురాలు రాధ. ఇంటిల్లిపాది గొల్లుమన్నారు! శంకరం లోపల లోపల నవ్వుకున్నాడు!

—o❋o—

# గ్రామాభ్యుదయము

చదలవాడ సోదరీ కవయిత్రులు

పల్లెలు పత్తనములకున్
తల్లులు – సిరిసంపదలకు తావులు; వానిన్
చల్లని చూపులఁ గనినన్
ఎల్లప్పుడు తిండి గుడ్డ లేర్పడు సుమతీ!

లేమిడి మాపెడి తెలివిడి
గ్రామీణుల కుందు నంచుఁ గన్గొని వడిగా
గ్రామాభ్యుదయమ్ము నకై
నేమమ్ము వహింపఁదగును నేతలు సుమతీ!

ఎన్నో విద్యలు నేర్చిన
దున్నలచే హాలము దున్నఁ దొడఁగని యెడలన్
సున్న యగున్ మన జౌన్నతి
మిన్నగదా! కర్షకుండు మేదిని సుమతీ!

కలమున్ హాలమున్ గైకొను
తెలివిం గలవారి సన్నుతింపఁగ వశమా?
కలమున్ గొని, హాలమున్ గని
చులకన యొనరించువారు శుంఠలు సుమతీ!

పల్లెల పాఁడిని పంటను
కొల్లగ భుజియించి వాని కొఱఁతలు తీర్పన్
ఉల్లాసపడరు నేతలు
చెల్లాచెదరగును దాన శ్రీగతి సుమతీ!

వ్యవసాయోన్నతికొఱకై
అవిరళ యత్నమ్ము నర్పనగుఁ గాదేనిన్
భువి నవ్య పరిశ్రమములు
నవరింపవు జీవితావసరములు సుమతీ!

# కే నో ప ని ష దు


మూలం :

స్వామి చిన్మయానందజీ

అనువాదం:

డాక్టరు W. రాధాకృష్ణయ్య




(గత సంచిక తరువాయి)

అందువలన ఇతరులు ఉపయోగించిన మాటలను పలికి తన భావమును తెలియచ్చవలసియున్నది. వేరు మార్గములేదు కనుక, "ఆత్మను, వ్యక్తముగను, అవ్యక్తముగను తెలుసుకొను మహనీయుడు ఆత్మ నెఱుగుచున్నాడు." అని పలుకవలసి వచ్చెను.

భావాతీత అనుభవమును తెలుపుటకు ఆగమముల ఆధారములవల్ల తెలుప సాధ్యముగనున్నది. వేరు సహాయములేదు. శ్రుతులుకూడ ఈ సహాయమును అవలంభించి, ఏదో యొక మహాపురుషుని వాక్యము లని అచ్చటచ్చట ప్రకటించుచున్నవి. అదే పద్ధతిని ఈ కేనోపనిషత్తునందు శిష్యుడు తన అంతరాత్మాను భవమును గురువుకు తెలుపుటకు ఉపయోగించుచు న్నాడు. "మనలో ఎవడు బ్రహ్మము నెఱిగియున్నా డనగా. - ఎవడు వ్యక్త స్వరూపముగను, అవ్యక్త స్వరూపముగను బ్రహ్మము కనుగొనుచున్నాడో అతడు నిజముగ తెలుసుకొనుచున్నాడు."

యస్యామతం తస్య మతం మతం
యస్య న వేదసః

అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజాన
తామ్. ॥ 3.

తనకు గోచరము కాలేదని తలచువాడు దానిని తెలుసుకొనుచున్నాడు. ఎవడు తనకు సుగోచరముగ నున్నదని తలచుచున్నాడో అతడు తెలియలేడు. జ్ఞానపండితులకది గోచరముకాదు. జ్ఞానరహితులకది సుగోచరముగనున్నది.

ఈ మంత్రము శ్రుతిమాత యొక్క ప్రత్యక్ష వాక్యములు. (గురుశిష్యుల సంవాదము కాదు.) శ్రుతి పాఠకుల సహాయార్థము - శ్రుతి ప్రకటించుచున్నది. వాక్యములతో అద్యంతరహితుని వర్ణించగలవిషయ ములు ఈ మంత్రమున రెండవ పాదమున ఇమిడి యున్నవి. ఒక వస్తువును మనము చూచినపుడు, మన జ్ఞానేంద్రియముల ద్వారా, మన అనుభవబుద్ధి ద్వారా దానిని గ్రహించగలుగుచున్నాము. ఇవి పరిమితికలవి కనుక పూర్ణజ్ఞానమును గ్రహింపజాలవు. ఇవి ప్రక టించగల వాక్యములెల్ల, పూర్వానుభవ జ్ఞానమువల్లనే సాధ్యము. అందువల్ల పరమాత్మను వర్ణించదమనగా, వ్యక్త స్వరూపమున్న, పరిమితికి లోనై కనబడు ఆత్మను వర్ణించుచున్నామని తెలియవలెను.

అంతర్ముఖ విచార జ్ఞానము మాత్రము శుద్ధ జ్ఞాన ఎఱుక సామ్రాజ్యమును చేరగలుగుచున్నది. పర మాత్మను వాక్యములతో ప్రకటించుటవల్ల, పరమా త్మను దూషించునట్లగుచున్నది. పరమాత్మ అనుభ వము కలిగినపుడు ఆ అనుభవము మన సహజ ఆత్మ వలెనే అనుభవించవలసియున్నది. ఒక గది చీకటిగా యుండినచో తలుపు తెరచుటచేత, గది సూర్య ప్రకాశమువలన ప్రకాశము పొందుచున్నదని చెప్ప వచ్చును. సూర్యుడు సూర్యప్రకాశమున ప్రకాశించు చున్నాడని చెప్పబడదు. అంధకారమును తొలగిం చుటయే ప్రకాశము యొక్క కార్యము. ఆత్మ జ్ఞాన జ్యోతి. ఆతని ప్రకాశమును వదలి వేరు ప్రకాశము

వలన అతడు తెలియబడడు. సూర్యుడు తన్నుతాను ప్రకాశించుకొను నవసరములేదు. తాను ప్రకాశ స్వరూపుడు.

### అహంకారమును చంపుము.

ఒక బొంబాయి మార్వాడి వ్యాపారి కొంత కాలం క్రింద ఆరు నెలలు నిద్రలేక బాధపడుచుండెను. ఒకనాడు అతడు నిద్రపోవుచుండగా, ఒక నల్లి అతని చెవుమార్గమున తలలోనికి వెళ్ళి, మెదడులో బోయి చేరినది. పది నిమిషములకు ఒకతూరి బుర్ర చుట్టు తిరుగును. తాను తినుటకు చక్కని ఆహారమున్నచాయని అది వెదకుచున్నది. వ్యాపారి ప్రపంచమంతయు చుట్టి, తన వ్యాధినివారణ పొందలేక, స్వస్థానము చేరెను. లక్నో పట్టణమున ఒక గొప్ప వైద్యుడున్నాడని అతనికి తెలిసినది. గొప్ప ఆశతో అచ్చటకు వెళ్ళినాడు. వైద్యుడు అతనిని విపులముగ పరీక్షించి, వ్యాధిరూపము బయలు పరుపక తాను నివారణ చేసెదనని చెప్పెను.

కొన్ని వారములు గడచినది. వ్యాపారి నిద్రలేనందువలన నరములు కొద్దికొద్దిగా కృశించుచుండెను. ఒకనాడు వైద్యుడు వచ్చి, "పశ్చిమ యుద్ధరంగమున రెడ్క్రాసు సమితివారి వద్ద ఒక జర్మనీలో తయారగు మందు వున్నది. దానిని నా సిఫార్సువలన తెప్పించగలను. ఒక మనిషి అక్కడికి వెళ్ళవలె. పంపగలవా" అని అడిగెను.

ఖర్చు ఎంత విపులముగ వ్యయము కావలసియున్నను వ్యాపారికి లక్ష్యము లేకుండెను. బాధ తొలగిన చాలును. కొన్ని నెలలు జరిగెను. వ్యాపారికి అధిక నిరుత్సాహము కలిగెను. ఒకనాడు వైద్యుడు చిరునవ్వుతో సమీపించి "ఇదిగో మందువచ్చినది నీ బాధ మాయము కాగలదు. ఇందు మూడు గొట్టములున్నవి. ఒకదానివల్ల, నీ నల్లి మూర్ఛిల్లి కొన్ని రోజులు చలించక యుండగలదు. వారము గడచిన వెనుక రెండవ గొట్టముతో నల్లిచనిపోవును. మూడవ దానితో నల్లి చెవు ద్వారా బైటపడిపోవును" అని తెలిపెను. వ్యాపారికి చింత తొలగి చాల ఉత్సాహము కలిగెను 'అంతటి ధనవ్యయము చేయవలసిన మందు లేకదా, మెదడులోని నల్లులను చంపగలదు; అని భావించెను.

మరుసటి దినము, వైద్యుడు ఇతర సహవైద్యులతో సహా అతనిని ఆపరేషను గదిలోనికి పిలుచుకొని వెళ్ళి అతి ఆడంబర పరికరముల సహాయముతో మొదటి మందును సూది ద్వారా ప్రయోగించెను. వైద్యుడు తెలిపినట్లు, అతని మెదడులోనున్న నల్లి మూర్ఛ చెందినది. అతనికి మునుపెన్నడు పొందని గాఢనిద్ర ఆ రాత్రి కలిగినది. మూడు రోజులు వెళ్ళుటతో, మరల ఆ నల్లి, నిర్దయతో అతని మెదడును నములుట కారంభించెను.

వారము రోజులు గడచునప్పటికి వైద్యుడు రెండవ గొట్టములోని మందును ప్రయోగించెను. వ్యాపారికి, నల్లి నిజముగ చనిపోయినదని తెలిసినది. ఆ వారము రోజులలో ఒక పర్యాయము కూడ నల్లి కదలినట్లు అగుపడలేదు.

వారము రోజులు మరల గడచినవి. వైద్యుడు తన శిష్యబృందమునంతయు, ఆపరేషను గదిలోనికి పిలుచుకొని వచ్చెను. గొప్ప జర్మనీ ఔషధమును ప్రయోగించుటకు విపులమగు ఏర్పాటులు చేయబడెను. మూడవ గొట్టములోని మందు చక్కగ ప్రయోగింపబడెను. ఒక గంట వెళ్ళిన వెనుక నీటితో వ్యాపారి చెవును కడిగిరి. ఆ నీటిలో చనిపోయిన నల్లి తేలుచుండెను. వైద్యుడు దానిని ఎత్తి, వ్యాపారికి చూపెను.

వ్యాపారిని బైటికి పిలుచుకొని వెళ్ళిరి. వైద్యుడు తలుపులు మూసి, శిష్యులకు వ్యాధి వివరణగురించి ఉపన్యాసము మొదలుపెట్టెను.

సోదరులారా! చాల బాధకరమగు వ్యాధికి తగు చికిత్సను మీరు ఇంతవరకు గమనించగలిగితిరి. ప్రపంచమునందు ఎచ్చటను ఈ వ్యాధికి తగు చికిత్స అతడు పొందలేకపోయెను. కాని, ఈ జర్మనీ ఔష

ధములు, ఈ ఊరి బజారులో తెచ్చిన ఆవిరి నీటి గొట్టములు. ఈ చికిత్సలో నేను చేసిన ఘన కార్యమేమనగా, నిన్నటిదినము రైల్వేస్టేషనంతా వెదకి ఒక బ్రతికిన నల్లిని సంపాదించుటయని చెప్పవలెను. ఆ నల్లి దొరకగనే, దానిని ఒక పేటికలో అదిమి, చనిపోయిన నల్లిని భద్రముగా కాపాడితిని. నేడు చెవు కడిగిన నీటిలో మీరు చూచిన నల్లి అదియే. ఈ చికిత్స తగినంత శాస్త్రోక్తముగా లేదని తోచును. కాని, విపరీత రోగికి గల మనోరోగమునకు ఘాటక ఔషధముల కల్పిత గుణముల ప్రయోగించుట ఒక చక్కని పద్ధతిగాయున్నది.

పారమార్థిక విచారమున, మన మెల్లరము ఈ బొంబాయి వ్యాపారివలె నున్నాము. కల్పిత నల్లివల్ల పొందరాని బాధలను మన మనుభవించుచున్నాము. అహంకారముతో తాదాత్మ్యముగా కల్పించుకొని, నేను,నాదియని, దుఃఖములను, పరిమితులను, ఆద్యంతములను అనుభవించుచున్నాము. ఇందుకు మన మెదడు నందుండు అహంకారమను నల్లిని చంపగల ఆత్మజ్ఞానమను అపరూప ఔషధము నివ్వగల లక్నో వైద్యుడు అవసరమగుచున్నాడు. ఆత్మజ్ఞానము పొందిన వెనుక, మనకు ఎట్టి రోగము లేదనియు, ఉండునది మన సహజ ఆత్మస్వరూపమనియు తెలియగలదు.

ఆత్మజ్ఞానజ్యోతి, చైతన్య రూపమున, మన బాహ్య, అంతర వ్యవహారములయందు అధిష్ఠించియున్నాడు. ఈ పరమాత్మ జ్యోతి, బుద్ధియందు ప్రతిఫలించి, అహంకారమను ప్రతిబింబమును కలిగించు చున్నది. అంతటితో ఈ సామ్యమును నిలిపి, కొంత విచారించవలసియున్నది

సత్యమును తెలుసుకొనుటలో అసత్యము మాయమగుచున్నది. భక్తుడు పూర్ణప్రేమ భక్తితో హృదయవాసియగు పరమాత్మయందు లయము పొందునపుడు పరాభక్తి ఏర్పడుచున్నది. అదియే పరమ ఎఱుక ప్రభావము. మహాత్ములందరు తమ సాధనలవలన పొందగలిగిన పరమపద అనుభవము ఏకరూపముగ నున్నది. అందు మార్గము ఏ రీతి నున్నను వ్యత్యాసము కలుగదు. ఆత్మ అను దేవళమున యాత్రికులందరు కడపట చేరవలసి యున్నది, ఆత్మ సన్నిధియందు అనుభవకాలమున, అనుభవించువాడు అనుభవించునది, అనుభవము, వ్యతిరేకముగ నుండజాలవు.

పరమాత్మ శాశ్వతముగ ప్రత్యేక రూపమున యుండుననియు, భక్తుడు శాశ్వతముగ ప్రత్యేకముగ నుండుననియు వైష్ణవులను మధ్వ, రామానుజాచార్యుల అనుయాయునులు నమ్ముచున్నారు. వేదాంతులు తమ ఉన్నత ఆత్మానుభవ కాలమున, అద్వైత, ఆత్మరసమై శుద్ధ దివ్యజ్ఞాన స్వరూప అఖండానుభవమును అనుభవించుచున్నారు.

మనము శుద్ధ ఆనంద స్వరూపులయినచో, ఇక ఆనంద మనుభవించువారు ఎవరు మిగిలియుండగలరని ద్వైతులు కొదువబడుచున్నారు. ఉత్కృష్ట ఆనందమును, ఆనందానుభవముగ పొందవలెనని వారికి కోరిక కలదు. వేదాంతి, తనవిరాగ, నిస్పృహ, వివేక విచారమువల్ల, అనుభవించబడు ఆనందము, తనకన్న వ్యతిరేకముగ నుండునది అశాశ్వతము, కోరదగినది కాదు అని తలచుచున్నాడు. ఆనందమనుభవించువాడు ఒకడు ప్రత్యేకముగ నుండినచో అది మిథ్య అగుచున్నది. ఆనందస్వరూపము తానైనచో, అపుడు శాశ్వత శాంతము కలుగుచున్నదని శ్రుతులు ఏకగ్రీవముగ తెలుపుచున్నవి. తెలియుచుండు తెలివి, వ్యక్తమునకు, అవ్యక్తమునకు అతీతము అనుటలో ఈ భావము పూర్తిగ తెలియుచున్నది.

ఇపుడు, ప్రతిబింబము, అద్దమును మరల విచారింతము. ఒక అద్దమునకు మూడంగుళములుండు ఒక గ్యాసు లైటును పెట్టెదము. దాని ప్రతిబింబము అద్దములో మూడు అంగుళములు వెనుకవైపు అగుపడును. దీపమును జరిపి అద్దము ప్రక్కన చేర్చినచో, అద్దమున గ్లాసుకుండు మందమునకు సరిగా, దీపపు ప్రతిబింబముండును. గాని, దీపపు ఉష్ణమునకు అద్దమునయందు పాదరసము ఆవిరిగ మారిపోయి, ప్రతిబింబము

లేకపోవును. అపుడు ప్రతి బింబము బింబముతో లయించుచున్నదని శాస్త్రములు తెలుపుచున్నది.

ఆత్మజ్యోతి బుద్ధి ద్వారా ప్రతిఫలించి అహంకారము అను ప్రతి బింబము బుద్ధికిముందు ఏర్పడుచున్నది. పారమార్థిక సాధకుడు ఉన్నత ఆశయము గల జీవితం నడపడిచే నెమ్మదిగా అంతర్ముఖము పొందుచున్నాడు. అందువల్ల ఈ అహంకారమను ప్రతి బింబము ఆత్మవైపు జరిగి, ఆత్మతో లయమగుచున్నది. భక్తుడు ఇట్టి సాధనవల్ల, నిరాడంబరుడు, శాంతుడు, స్వార్థరహితుడు, దైవభావము కలవాడగుచున్నాడు. అయినను అతనికి ఆత్మానుభవము కలుగుటలేదు,

ఈ స్థితికి పిమ్మట సాధకుడు అభ్యాసమువల్ల పారమార్థిక అభివృద్ధి పొందవలెను. ధ్యానాభ్యాసము సాధన చేయుటవల్ల ప్రతిఫలింప జేయు బుద్ధియందలి బింబము ఆత్మకు అభిముఖము పొంది సమీపించును. పిమ్మట ఈ ప్రతిబింబము కలిగించు బుద్ధి బింబమగు ఆత్మతో లయమగుచున్నది.

అపుడు నిత్యసాధన ధ్యానాభ్యాసమువల్ల బుద్ధి ఆత్మను సమీపించి ఆత్మానుభవము పొందుచుండును. అపుడు ఈ ప్రతిబింబమగు అహంకారము రూపులేక పోవుచున్నది. అంతయు అఖండ ఆనంద సాగరము, పరిపూర్ణము. శుద్ధ ఆత్మయొక్కటే యుండును. ఇదియే సమాధి అనుభవము. ఇది జ్ఞానభిక్షువు వలన, మహా పురుషులు ఆత్మయను విధము వారు ఆత్మను తమకన్న భిన్నముగ అనుభవించుటలేదు. ఈ భావమునే శ్రుతిస్మృతి వాక్యములతో తెలుపుచున్నది. హిందు మతముననే కాదు - ప్రపంచమున గల సర్వమతముల తీర్మానము ఇదియే. ఇట్టి అనుభవము ప్రతి మానవునికి సాధ్యము. ఇదియే జన్మసాఫల్య గమ్యస్థానము.

ఇట్టి సూక్ష్మతర, పరిపూర్ణ అనుభవమును తెలుపుటకు ఈ కేనోపనిషత్తునందలి శిష్యుడు పున్నాదమాటలాయనునట్లు "పైమంత్రమున నాకు తెలియుననువానికి తెలియదు. నాకు తెలియలేదు అనువాడు నిజముగ తెలుసుకొనుచున్నాడు." అను మాటలు తీక్ష్ణ అనుభవమువల్ల పలుకుచున్నాడు. శిష్యుని అనుమానమేమనగా, తాను ఆత్మానుభవము పొందు కాలమున అనుభవించుచున్నానను కర్త, కర్మలు లేకపోవుటవల్ల, కర్తృత్వభావము కలిగిన తోడనే ఆత్మభావము లేకుండుటవల్ల నిర్ధారణ చేయజాలకున్నాడు.

కూపమును చూచునపుడు భూశిమును కూడ ఒకే సమయమున చూడజాలము. సర్పము అగుపడగనే. పాము మాయమగుచున్నది. అహంకార ముండుచోట భగవంతుడు లేడు. వేదాంతమున తెలుపు అద్వైతము హిందూమతమునకు మాత్రము తెలిసియుండునది కాదు. చైనాదేశపు గొప్ప మతబోధకుడు, శ్రీ యుంగ్ చియా - టా - షి - ఇట్లు కొన్ని పద్యములు వ్రాసియున్నాడు.

> నీవు వెన్నంటి పోయిన
> అది మాయమగును
> నీవు పట్టుకొనలేవు దానిని
> దానిని వదలియుండనూలేవు
> రెండు నీ చేత గాకయుండ
> అది దాని దారినే ప్రవర్తించుచుండు
> నీవు పలుకమాను. అది పలుక మొదలు పెట్టు
> నీవు పలుక మొదలు పెట్ట అది మానమాను.

భక్తి, జ్ఞాన, కర్మ, హఠయోగములన్నియు ఏకైక పరిపూర్ణ పదవిని చేరు దారులుగా నున్నవి. అహంకార నాశనము అన్నిటి ఉద్దేశము. అది యేమనగా గొప్ప శత్రువు "అహంకార మరణము పొంది దివ్య జీవితము ననుభవింపుము" అని ఆనంద కుటీర ఋషి (శ్రీ శివానందులు) కేకలు వేయును. అట్టి కేకను వినండి. విచక్షణతో ప్రవర్తించి, సత్యమార్గమును అనుసరించి, ప్రేమ భక్తుల సహాయముతో పరిపూర్ణ ఆత్మపదవిని చేరండి—

(సశేషము)

# ప్రథమ దశ




మెట్రిక్ పద్ధతి తూకాలు, కొలతలు అమలు జరిపే కార్యక్రమంలో ప్రథమ దశ 1958 అక్టోబరు 1 వ తేదీన ప్రారంభమయింది. వివిధ రాష్ట్రాల లోని ప్రత్యేకంగా పేర్కొనబడిన కొన్ని ప్రాంతాలలో మెట్రిక్ తూకాలు ఉపయోగించడం చట్టబద్ధ మయింది.

అదే విధంగా ప్రభుత్వ శాఖలలోనూ, నూలు వస్త్రాలు, ఇనుము, ఉక్కు, ఇంజనీరింగు, భారీ రసాయనిక పదార్థాలు, కాగితం, సిమెంటు, జనపనార మొదలైన పరిశ్రమలలో ప్రవేశపెట్టారు.

ఈ పద్ధతి క్రమంగా దశలవారీగా దేశ మంతటికీ వర్తింపబడుతుంది.

## మెట్రిక్ పద్ధతి

అంతటా
ఒకే పద్ధతి-ఎంతో సులభమైనది

ప్రస్తుత తూకాలకు
మెట్రిక్ పద్ధతిలో
సమాన
తూకా లేమిటో
చూడండి



భారత ప్రభుత్వంవారిచే జారీ చేయబడినది

# మెట్రిక్ తూకాలు : మారకపు పట్టీ

(కత్తిరించి వుంచుకోండి)

| చటాకులు 5 తులాల చొ॥ | గ్రాములు (సుమారుగా) |
|---|---|
| 1 | 58 |
| 2 | 117 |
| 3 | 175 |
| 4 | 233 |
| 5 | 292 |
| 6 | 350 |
| 7 | 408 |
| 8 | 467 |
| 9 | 525 |
| 10 | 583 |
| 11 | 642 |
| 12 | 700 |
| 13 | 758 |
| 14 | 816 |
| 15 | 875 |

| మణుగులు 40 శేర్ల చొ॥ | కిలోగ్రాములు (సుమారుగా) |
|---|---|
| 1 | 37 |
| 2 | 75 |
| 3 | 112 |
| 4 | 149 |
| 5 | 187 |
| 6 | 224 |
| 7 | 261 |
| 8 | 299 |
| 9 | 336 |
| 10 | 373 |
| 11 | 411 |
| 12 | 448 |
| 13 | 485 |
| 14 | 523 |
| 15 | 560 |
| 16 | 597 |
| 17 | 635 |
| 18 | 672 |
| 19 | 709 |
| 20 | 746 |

| శేర్లు 80 తులాల చొ॥ | కిలోగ్రాములు | | గ్రాములు (10 గ్రాములకు సుమారుగా) |
|---|---|---|---|
| 1 | — | – | 930 |
| 2 | 1 | – | 870 |
| 3 | 2 | – | 800 |
| 4 | 3 | – | 730 |
| 5 | 4 | – | 670 |
| 6 | 5 | – | 600 |
| 7 | 6 | – | 530 |
| 8 | 7 | – | 460 |
| 9 | 8 | – | 400 |
| 10 | 9 | – | 330 |
| 11 | 10 | – | 260 |
| 12 | 11 | – | 200 |
| 13 | 12 | – | 130 |
| 14 | 13 | – | 60 |
| 15 | 14 | – | — |
| 16 | 14 | – | 930 |
| 17 | 15 | – | 860 |
| 18 | 16 | – | 800 |
| 19 | 17 | – | 730 |
| 20 | 18 | – | 660 |
| 21 | 19 | – | 600 |
| 22 | 20 | – | 530 |
| 23 | 21 | – | 460 |
| 24 | 22 | – | 390 |
| 25 | 23 | – | 330 |
| 26 | 24 | – | 260 |
| 27 | 25 | – | 190 |
| 28 | 26 | – | 130 |
| 29 | 27 | – | 60 |
| 30 | 27 | – | 990 |
| 31 | 28 | – | 930 |
| 32 | 29 | – | 860 |
| 33 | 30 | – | 790 |
| 34 | 31 | – | 730 |
| 35 | 32 | – | 660 |
| 36 | 33 | – | 590 |
| 37 | 34 | – | 520 |
| 38 | 35 | – | 460 |
| 39 | 36 | – | 390 |

**1 కిలోగ్రాం = 1,000 గ్రాములు**

DA 59/247-TG

# రాణీ ప్రజలు

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

—(౦)—

వీరు గుజరాతు రాష్ట్రంలోని ఆటవిక జాతులకు సంబంధించినవారు. మనము తఱచుగా చూచు యెఱుకలజాతి స్వభావ లక్షణాలు వీరిలో ఉన్నవి. ఈ తెగలోని వారు నిత్యసంతృప్తులు; అత్యంతోల్లాసులు; శృంగారవ్యక్తులు. ఈ జాతికి చెందినవారు నూరత్తుమండలములో నివసించు భారతీయ కుటుంబాలకు సన్నిహితులు. గెజట్లలో ఈ జనాంగమును "కాళీప్రజ" అని వ్యవహరింతురు. నల్లని మేనిచాయతో నిగనిగలాడుచు, సాటి వారితో చతుకోక్తులాడుచుందురు. నగరవాసులతో పోల్చిచూచినపుడు, వీరు వెనుకబడ్డ అనాగరకులుగా పరిగణింపబడుదురు. వీరి ఆచారవ్యవహారములనుబట్టి- పురవాసులకంటె విభిన్నత గలవారనియే చెప్పవలసి వచ్చుచున్నది.

మొన్న మొన్నటివఱకు ఈ రాణీప్రజలు పారసీక భూస్వాములను ఆశ్రయించి, కేవలము స్వల్పమగు ఆదాయమును ఆశించి, తమ జీవితాంతమువరకు రైతు కూలీలుగ పనిచేసెడివారు. సొంత పొలములు లేనందున ఈ జాతి వారు పెక్కురు, పిల్లలు, జల్లలు ఆడంగులతో సహా, సకుటుంబముగా, తమ యజమానుల నేలలలో పనిచేయువారు. పాశవస్వభావము గల భూస్వాములు కొందరు ఈ బీదకూలీలపై దౌర్జన్యాలు సాగించుటేగాక, యెంత క్రౌర్యానికయినను పూనుకొను వారు. అగతికులయిన రాణీలు అమాయకులు; నిఱుపేదలు - కనుక నేలఖామందులు సులభముగా వారివిషయమున సాహసమును నెరపుటకు ఒడిగట్టువారు. కాని, యిట్టి నిరంతర ధనాభావజనిత దారిద్ర్యమున దిక్కుతోచక తట్టుముట్టాడుచు ప్రపంచయాత్ర సాగించుచుండినను, ప్రాణిసహజమయిన ఆత్మస్వాతంత్ర్యవీధిని స్వేచ్ఛావిహారము చేయుచుందురు. అల్పసంతుష్టులగు రాణీలు తమ జీవితమును అదృష్టదేవత కప్పగించి "రేపు" అను భవిష్యత్తునుగూర్చిన చింత దిగనాడి కాలక్షేపము చేయుదురు. నిజముగ వీరు దేవుని బిడ్డలనుటలో సందియము లేదు.

వీరిలో కొందరు ఆటవికవస్తుజాతముపై ఆధారపడి జీవింతురు. మరి కొందరు, చాపలు, బుట్టలు మొదలగు వానిని అల్లుకొని పొట్టపోసికొందురు. వీరు గ్రామాదులకు వెలుపల పల్లెటూళ్లవలె కనిపించు పదిపండ్రెండు గుడిసెలు నిర్మించుకొని వసింతురు. వారికి తమ పూర్వ

కాలవు జాతీయాచారములపై ఆసక్తి మెండు. రాణిప్రజలలో ఎవ్వరేని మరణించినచో ఆ యింటియందు వసించు తత్కుటుంబమువారు ఆ గృహమును పరిత్యజించి, దాని కనతిదూరమున నే వేరొక దానిని కట్టుకొందురు.

వీరి పూర్వులెల్లరు ఒక్కటిగానే ఒక చోట సమావేశమయి, దైవప్రార్థనము చేయువారు. అట్లు వారందరు చేరుస్థలము "వెస్టుమినిస్టరుఆబే"కు ప్రతిబింబమనదగు చిన్న దేవాలయము. పల్లెటూళ్లకు కొంచెము దూరమునగల ఏకాంత ప్రదేశమున, మూకుళ్లు, అంచులు లేని కుండలు నాలుగడుగుల యెత్తున పేర్తురు. వీనిలో మరణించినవారి జ్ఞాపకార్థము ఉంచబడ్డ ప్రమొక్కబడిరాళ్లు వుంచబడును. పేర్చిన భాండపంక్తిలో ఒక్కొక్కటి ఒక్కొక్క వంశవృక్షమునకు గుర్తుగ పరిగణింపబడును. వీరు ఆ శిలలను సేవించునపుడు ఏకుండ యేవంశమునకు చెందినదో, ఆ వంశమున పుట్టిన బిడ్డలనుగూర్చి వర్ణించి కొలుతురు. ఎవ్వతెయేని ఒక గర్భిణిస్త్రీ మృతినొందుచో, దారువులో నిర్మించబడిన యొకానొకా క్రీడాసాధనమును మృతాంగనా జ్ఞాపకచిహ్నముగ నెలకొల్పి, వీరు దానిని ఆరాధింతురు.

రాణిప్రజలకు వంశపరంపరాగతములైన అపూర్వ (సంగీత) వాద్యసాధనములు గలవు. వానిని వాయించుచు లయతప్పకుండ అందరును గుంపుగూడి పాడుట, నాట్యమాడుట మొదలగు సరసక్రీడల యందు వీరి కత్యంతాపేక్ష. గుమ్మడికాయలతో చేయబడి నెమిలియాకలు గ్రుచ్చబడిన కిరీటములు, అట్టి నాట్యములలో వీరు అలంకరించుకొందురు.

వీరి నృత్యకోలాహలములు వివాహ సందర్భములలోను పండుగులలోను కనుల పండువుగ నుండును. ఈ యాటవిడులు ఆహ్వానింపబడకున్నను, తమ తెగలలో జరుగు పెండ్లిండ్లకును, పండువులకును నాట్యమునిమిత్తము - అట్టిచోట్లకు (పది మైళ్లదూరముననున్నను) పయనించుటకు వెనుకాడరు. వీరి సంగీత సాధనములలో ముఖ్యమయినది "ఢోల్లు" అను మద్దెల. దీని సహాయముతో అటకు వచ్చినవారెల్ల స్త్రీ పురుష వివక్షలేకుండ రాత్రియంతయు నృత్యమొనర్తురు.

ఆనువాయితి ననుసరించి వధూవరులు స్వేచ్ఛగా, యథేచ్ఛగా, సర్వస్వతంత్రముగ ఒండొరుల ప్రేమించికొని వివాహమాడుదురు. ఈ విషయమున ఉభయ పక్షములలోని పెద్దలకుగాని, వధూవరుల తలిదండ్రులకుగాని యే మాత్రము జోక్యము లేదు. కాని, లాంఛనముగ వారి అంగీకారము పొందుదురు.

ఈ రాణీప్రజ క్రమముతప్పిన జాతులలో

నొకటి. అందుచే స్త్రీ పురుషులు కలిసి మెలసి యుండుట యనునది — పేహ్యామని గాని, యెబ్బెరికమనిగాని వీరు తలంపరు. వీరిలో రెండు తెగలుగలవు. ఈ తెగలను 'చౌదరీలు' – 'గామిట్లు' – అందురు. పరస్పర మిండలి ప్రజలు, తమ తెగయే గొప్పదని – శ్రేష్ఠమయినదని వాకొందురు. కొలది కాలము క్రిందటివరకు ఈ యిరు తెగలు 'ఎవరికివారే, యమునాతీరే' – అను ధోరణిలో నుండెడివి. ఇప్పుడీ రెండును ఏకమయి సంబంధ బాంధవ్యములుగూడ జరుపుకొనుచున్నవి.

రాణీప్రజల మాతృభాష గుజరాతి. కేవలము విద్యావిహీనులుగ ఉన్న వీరికి – చదువు నేర్చుకొన తగు సౌకర్యములు కల్పింపబడ్డవి. వీరి పిల్లల విద్యాభ్యాసమునకు 'సోనగత్'లో ఒక పాఠశాల స్థాపింపబడినది. అందులోని విద్యార్థులకు ఉచితాహారము ఇచ్చుచున్నారు. ముఖ్యముగ వారికి నేర్పబడునవి వృత్తి విద్యలు. కాని, కొంత విద్య నేర్చినంతనే, వీరిలో కొందరివుడు, తమ చిరతరాచారములను జాతి మర్యాదలను పాటింపక వానిని చిన్న చూపుతో చూచుట దురదృష్టము. వంశానుగతముగ వచ్చుచున్న వీరి సంగీత నాట్యములకు విద్యావంతులగు నాగరీకుల ఔదాసీన్యమువలన వినాశము సంభవించునేమో యని విచారము కలుగుచున్నది. భారతదేశ గ్రామీణ జనాంగకళాలక్ష్మికి చేటు వాటిల్లునెడ, అది యొక గొప్ప నష్టమనియే యనుకొనవక తీరదు.

—(o)—

"ప్రేయసీ! నిన్ను 'ఒసేయ్!' అని పిలవాలని నాకు మోజుగా నున్నది. ఏమంటావ్!"

"మీరు నన్ను కుక్క అని పిలచినా పలుకుతాను. కుక్కను చూచినా, అది జ్ఞాపకము వచ్చినా మీరు తలపుకొస్తారు."

యస్. చిరంజీవిబాబు

---

## గృహలక్ష్మి

### సంక్రాంతి, చేనేత సప్తాహ సంచికలు

—(o)—

సంక్రాంతి, చేనేత సప్తాహముల సందర్భమున జనవరి, ఫిబ్రవరి నెలలలో ప్రత్యేక సంచికల వెలువడజేయ నుద్దేశించాము. ఈ సంచికలను రచయితల, అభిమానుల సహాయ సహకారములతో ఆకర్షణీయంగా, కథానికలు, నాటికలు, చిత్రాలు, అమూల్యమైన వ్యాసములతో రూపొందించ ప్రయత్నించెదము.

చేనేత సప్తాహ సంచికకు చేనేత పరిశ్రమకు, వ్యాపారమునకు సంబంధించిన అనుభవ పూర్వకమైన వ్యాసములను ఆహ్వానిస్తున్నాము. ఈ సందర్భమున కలకాలముగా జాతీయ సౌభాగ్యమునకు తోడు నీడగానున్న చేనేతపరిశ్రమ వర్ధిల్లడానికి అవకాశములను విస్తృతంచేయు తోడ్పడటమే మా ఆదర్శ లక్ష్యాలు.

— ఎడిటర్

---

# పరిణామము

**శ్రీ గాడేపల్లి శంకరం**

—— (౦) ——

(గతసంచిక తరువాయి)

## ద్వితీయాంకము :

### ఒకటవ రంగము

ప్రదేశము : రావుసాహెబుగారి ఇల్లు

ప్రవేశము : (ఆయన కూతురు లలిత - పెండ్లి ఈడు - ఆ రోజున బి. ఎ. పరీక్ష ప్యాసయినట్లు తెలుస్తుంది - తన ప్రియుడైన 'మూర్తికి' క్లాసుకూడా వచ్చింది. అపరిమితమైన ఆనందముతో ఆడుతూ పాడుతూ - ఉంటుంది. మూర్తి ప్రవేశిస్తాడు) లలిత అది గమనించలేదు.

మూర్తి:-గుడ్ మార్నింగ్ లలితా ?

లలిత:-హల్లో! గుడ్ మార్నింగ్ మూర్తీ! రండి రండి!

మూర్తి:-ప్యాసయ్యావనే సంతోషంలో స్నేహితులు వచ్చినా కనిపించటంలేదు కాబోలు.

లలిత: క్షమించాలి — నేను పరీక్ష ప్యాసయినందుకే సంతోషం కాదు - మా మూర్తిగారికి క్లాసు వచ్చినందుకు కూడాను - మీరువచ్చి ఎంత సేపయింది? కూర్చోండి.

మూర్తి: ఒక్క నిమిషం అయివుంటుంది (కూర్చుంటాడు)

లలిత:-యు ఆర్ జస్ట్ ఇన్ టైమ్ - బోయ్! రెండు, కప్పులతో కాఫీ తీసుకురారా!

మూర్తి:-అయితే మాకీవేళ టీపార్టీ అన్నమాట!

లలిత:-టీపార్టీయే కాదు -

మూర్తి:-ఇంకా యేమైనా పార్టీలున్నాయా?

లలిత:-దీని తరువాత - సినిమా పార్టీ కూడా ఉంది.

మూర్తి:-ఎవ రెవరు?

లలిత:-మీరూ - నేనూ —

మూర్తి: ఇంకా -

లలిత:-అంతే!

మూర్తి:-మీ నాన్నగారు రారూ?

లలిత:-ఆయనకి తీరుబడి లేదన్నారు.

[బోయ్ రెండు కప్పులతో కాఫీ తీసుకొని వచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోతాడు. ట్రే - కెటిల్సు 2 కూడా వుంటాయి.]

లలిత:-(ఒక కప్పులో మూర్తికి యిస్తుంది - ఒక కప్పు తాను తీసుకుంటుంది)

మూర్తి:-(కాఫీని ఒక గుక్కెడు చప్పరించి) అబ్బ!

లలిత:-ఏమీ!

మూర్తి:- అతి మధురంగావుంది.

లలిత:-పాపం - పంచదార ఎక్కువైంది కాబోలు కొంచెము డికాక్షను, పాలు పోస్తానుండండి (అని పోస్తుంటే)

మూర్తి:-అసలు - చిన్నప్పటినుంచీ నాతో కలసి చదువుకున్న ఓ అమ్మాయి ఈవేళ ప్యాసయింది,

లలిత:-(కొంటెగా) అలాగా!

మూర్తి:-అందుచేత - అసలు హృదయమే మధురంగా ఉందీవేళ.

లలిత:-ఇంకా —

మూర్తి:-పైగా - ఆమె స్నేహితునికి క్లాసువచ్చిందని విని అతి మధురమైపోయి...

లలిత:- ఊ... ఊ - అతి మధురమైపోయి?

మూర్తి:- అతి మధురమైపోయిన ఆమె హస్తాలు తగిలి ఈ కాఫీ మధురాతి మధురమైపోయెగదా యని విన్నవించుకొనుచున్నవాడ

లలిత:- కవిత్వ ధోరణిలో కూడా దిగిపోతోంది మరి— హిహిహి

(ఇద్దరూ నవ్వుకుంటారు - కాఫీ త్రాగటం అవుతుంది)

మూర్తి:- తదనంతరంబు - సినిమా - అయితే మీ నాన్నగారు రాలేనన్నారా?

లలిత:- అవును.

మూర్తి:- మన ఉభయులనీ కలిసి వెళ్ళమన్నారా?

లలిత:- మీరు రాకపోతే - మూర్తిగారు నేను కలిసి వెళ్ళమా అంటే - సరేనన్నారు - ఏమీ మీకేమైనా అభ్యంతర ముందా?

మూర్తి:- అబ్బే! నాకేమీ అభ్యంతరం లేదు కాని.

లలిత:- ఆ. 'కాని' ఏమిటి మళ్ళీ

మూర్తి:- మన మిరువురము - అవివాహితులం కాదూ!

లలిత:- అవునూ!

మూర్తి:- యుక్త వయస్సు వచ్చిన వ్యక్తులం కూడాను.

లలిత:- అయితే నేమీ?

మూర్తి:- మనమిద్దరమే కలిసి వెళ్ళటం — మూడో వ్యక్తి లేకుండా వెళ్ళడం - భావ్యం కాదేమో అనుకుంటాను.

లలిత:- (అతని అభిప్రాయం గ్రహించి) పోనీ, మాని వేయవచ్చు కాని... మా ఇంట్లో ఈ వేళ - మన వివాహ ప్రసక్తి వచ్చింది - మా నాన్నగారు అంగీకరించారు - మీ నాన్నగారితో కూడా నేడో రేపో సంప్రదిస్తానన్నారు.

మూర్తి:- ఆయన ఒప్పుకోరు—

లలిత:- అయితే మన ఆశలన్నీ నిరాశపాలేనా?

మూర్తి:- లలితా! నీవు వట్టి అమాయకురాలవు సుమా! మనము చిన్నప్పటినుంచీ కలసి మెలసి చదువుకున్నాము - నా హృదయంలో నీకు నీ హృదయంలో నాకూ స్థానముందని గ్రహించుకున్నాము. మన జీవితంలోని మధుర క్షణాలను మరచిపోగలమా! మా నాన్నగారు నా మాటకు యెప్పుడూ అభ్యంతరము చెప్పరు - ఇప్పుడు మాత్రం వద్దంటారు.

లలిత:- ఇప్పుడు వచ్చిన అడ్డేమిటి?

మూర్తి:- ప్రస్తుతం నన్ను లండను వెళ్ళి I. C. S చదువమన్నారు —

లలిత:- (సంతోషముతో) ఆహా! అలాగా —

మూర్తి:- అవును ఈ శుభవర్తమానం నీకు చెబుదామనే వచ్చాను.

లలిత:- పరమ సంతోషంగా వుంది - తప్పకుండా వెళ్ళిరండి - కాని మీ యెడబాటు నాకు మాత్రం కష్టంగా వుంటుంది —

మూర్తి:- నాకూ అంతే — కాని నేను లండను వెళ్ళి వచ్చిన తరువాత తప్పక మన వివాహం జరుగుతుంది.

లలిత:- మరి - మా నాన్నగారు రేపే వెళ్ళి మీ నాన్నగారితో కలిసి మాట్లాడతానన్నారు?

మూర్తి:- ఆయనా - ఈ మాటే చెబుతారు - మరి నేను వెడతాను.

లలిత:- అప్పుడేనా?

మూర్తి:- కాదు లలితా! మన స్నేహితులనందర్నీ ఒక్కమారు కలుసుకుందామని బయలుదేరాను. ప్రథమంగా మీ యింటికే వచ్చాను.

లలిత:- అవును గాని - మన జమీందారు కొడుకు సెంబరు మీకు తెలుసా!

మూర్తి:- తెలియకేమి: 924 అతనూ ప్యాసయ్యాడు.

లలిత:- (ఆశ్చర్యంగా) ప్యాసయ్యాడూ!

మూర్తి:- అలా ఆశ్చర్యపోతావేమి? ప్యాసయ్యాడు.

లలిత:- అదికాదు - పాపం మన ఇంగ్లీషు లెక్చరరు ఎప్పుడూ అతన్ని - హేళనగా - ఏమీ రాదని క్లాసులో అంటూ వుండేవాడు కాదూ! పాసవ్వు తప్పుతాడేమో అనుకున్నాను.

మూర్తి - లేదు - మూడూ ప్యాసయ్యాడు - అయితే వాళ్ళకేమి - మహారాజులు - ప్యాసయినా ఒకటే కాకపోయినా ఒకటే - ఏదో పాపం - మొత్తం మీద గట్టెక్కిపోయాడులే—

లలిత:-మీరు కొంతవరకూ అతని 'పాస్'కి బాధ్యులనుకుంటాను.

మూర్తి: ఆఁ మనదేముంటెలే? చదువడుగాని, అతడూ కాస్త మెదడున్న రకమే! ఒక నెల రోజులు మేమిద్దరం వాళ్ళ యింట్లోనే కలిసి చదువుకున్నాము - పాపం నాతో తెల్లవార్లూ మేలుకొని చదివేవాడు.

లలిత:- అదే - కారణమైందని అంటున్నాను.

మూర్తి:-కావచ్చు - మరి నే వెడతాను—

లలిత: మళ్ళీ దర్శనం ఎప్పుడో?

మూర్తి:-నేను లండను వెళ్ళేముందు ఒకసారి వస్తాను- సెలవు - (వెడతాడు)

లలిత:-సెలవు. (అతని వేపే చూస్తూ నిలబడిపోతుంది- తెర వాలిపోతుంది)

(తెర)

ద్వితీయాంకము రెండవ రంగము

ప్రదేశము:-జమీందారుగారి ఇల్లు డ్రాయింగ్ హాల్, జమీందారు కొడుకు - అతని సహోధ్యాయి మూర్తి.

జమీందారు కొడుకు: బ్రదర్! మన చదువులు పూర్తి అయ్యాయిగదా ఈ పైన ఏమి చేద్దామనుకుంటున్నావు?

మూర్తి:-మా నాన్న ఐ. సి. యస్‌కి పంపిస్తానంటున్నారోయి—

జ.కొ:-అవును - నీకు క్లాసు కూడా వచ్చింది - ఐ. సి. యస్‌కి వెళ్ళతగిన వాడవే - తప్పకుండా వెళ్లు —

మూర్తి:-నీవేమి చేయదలచుకున్నావు?

(ఉన్మత్తుడు ప్రవేశిస్తాడు)

ఉన్మ:-శుభ్రమైన పిల్లనుచూసి పెళ్ళిచేసుకో దలచుకున్నాడు - అంతకన్న ఏమిచేస్తాడు? జమీందార్ పుత్రుడు - ఇకమీదట చేసేదేముంటుంది బాబూ!

(జ. కొ., మూర్తి లేచి గౌరవార్థం నిలబడతారు - మూర్తి కంగారు పడతాడు)

జ.కొ:-రండి! రండి! ఏమిటి యిలా దయచేసారు?

ఉన్మత్తుడు:-ఎటు గాలి వీస్తే అటువేపే ఎగిరిపోతూవుంటాము — మాకు కూర్చోటానికి తీరికా ఉండదు - చేయటాని కేదేనా పనీవుండదు - మాకేమైనా జమీందారీలా జాగీర్దారీలామా సుష్టుగా భోజనం చేసి - సుఖంగా నిద్రపోవడానికి?

మూర్తి:-(జ. కొ. తో) యెవరీయన?

జ.కొ:-మాకు పరిచితులే - మా నాన్నగారి దగ్గరికి తరుచు వస్తూంటారు - ఆయన ధోరణే అంత - ఏమీ కంగారు పడకు —

ఉన్మ:-చెప్పవయ్యా చెప్పు - పిచ్చిముండాకొడుకని చెప్పు - విద్యనూ విజ్ఞానాన్నీ గంగపాలు చేసిన వెర్రిముండాకొడుకనీ - నాకూ నా దేశానికీ ఉపయోగించలేని వట్టి చవటననీ చెప్పు - తెలిసిందా—

జ.కొ:-మా నాన్నగారు తోటలో పని చేయిస్తున్నారు - వారిని చూస్తారా?

ఉన్మ:-అల్లాగా! మేమిక్కడ ఉండకూడదన్నమాట- ఎంతటి గడుసువాళ్ళయ్యా! పోతానులే బాబు పోతున్నా. (వెళ్ళి వెనక్కు చటుక్కున తిరిగి) చూడూ! బానిస చదువులు చదువనే చదివారు- బానిస బ్రతుకులు మాత్రం బ్రతుకకండి - భరతమాతను చెరనుండి విడిపించే ఉపాయమాలోచించండి బాబుల్లార! వట్టి - శుష్కవాదాలు చేసి కాలం వృధా చేయకండి - మేయడం పేడ వెయ్యడం పశువుల పని - మెదడున్నందుకు వినియోగించడం మానవులమైన మనపని - అది నేర్చు

కోండి బాబు అది నేర్చుకోండి (అంటూ లోపలికి వెళ్ళిపోతాడు)

మూర్తి:-అసాధ్యుడులా ఉన్నాడే!

జ.కో:-ఇతని గాథ చాలావుంది. ఇదమిద్ధమని ఎవరూ చెప్పలేరు - విఫల మనోరథుడైన యుద్ధవీరుడని కొందరూ - విప్లవకారులలో ఒకడని కొందరూ అంటారు - ఎంతవరకూ నిజమో మాకు తెలియదు - పైకి మతిస్థిమితములేని వాడిలా - ఎప్పుడూ ఇదే ధోరణి - స్వాతంత్ర్యం! స్వరాజ్యం అంటూ పిచ్చిపిచ్చిగా వాగుతాడు —

మూర్తి:-మతిస్థిమితం లేకపోతే లేకపోవచ్చుగాని — ఇతని మాటల్లో మాత్రం అర్థం లేకపోలేదు సుమా!

జ.కో:-పాలిటిక్సు ఈజ్ ది లాస్ట్ రిజార్ట్ ఆఫ్ యె స్కౌండ్రల్ అన్నాడు జాన్సన్ - హూవిల్ రాజకీయాల్లో ప్రవేశించు. పోనిద్దూ పిచ్చిముండాకొడుకు - వాడి గొడవ మనకెందుకు? (గొంతుకమార్చి) నువ్వు ఐ. సి. యస్‌కి వెళ్ళ దలచావా! చాలా బాగుంది సుమా!

మూర్తి:-అవునుగాని బ్రదర్ నీవేమి చేయదలచు కున్నావో చెప్పావు కాదు—

జ.కో:-ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదోయి - ఏమి చేస్తే బాగావుంటుందంటావు? మా నాన్నగారు మాత్రం మా జమీందారీ వ్యవహారాలు చూడమం టున్నారు -

మూర్తి:—(నవ్వుతూ) నీకేమయ్యా—జమీందారుడవు— మాలాగ ఉద్యోగం చేయాలన్న అవసరం ఉండదుగా-ఆయన చెప్పినట్లు—ఇక పెళ్ళిచేసు కుంటావా ఏమిటి?

జ.కో:—ప్రస్తుతం 'పెళ్ళి' గురించి ఏమీ ఆలోచనలేదు.

మూర్తి:-ఆలోచించక పోవడమేమిటోయ్? వెనక ఒక వ్యక్తిని ప్రేమిస్తూన్నానని చెప్పావు. ఆమెను పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యంలేదా?

జ.కో:-నిజమే! ప్రేమించటంతోటే ఆగిపోయింది.

మూర్తి:-ఆ వ్యక్తి నిన్ను ప్రేమిస్తున్నదో లేదో తెలుసుకున్నావా?

జ.కో:_లేదు-అక్కడేవచ్చింది - యిబ్బంది.

మూర్తి:—అదేమిటి? చిత్రమైన వ్యక్తివిలాగున్నావు ఆమెకు నీయందు అనురాగం ఉందో, లేదో తెలుసుకోకుండానే ఆమెను నీవు ప్రేమిస్తున్నావా?

జ.కో:_అవును. ఆమెను ఎప్పుడూ చూస్తూనే వున్నాను-నా హృదయంవిప్పి ఎప్పుడూ ఆమెతో ఈ విషయం చెప్పలేకపోయాను - మన యిరువురికీ చిరపరిచితురాలే !

మూర్తి:—ఆమెను నేను ఎరుగుదునంటావా ?

జ.కో:—ఆ ! ఎరుగుదువు—ఎవరో చెప్పుకో చూదాం.

మూర్తి:—ఓ వ్యక్తిని ప్రేమించానని తప్ప - మిగతా వివరాలు ఏమీ తెలియచేయ లేదుగా — నేను గ్రహించలేకుండావున్నాను.

జ.కో:—మనకు చిరపరిచితురాలని చెపుతున్నాను గాదూ ?

మూర్తి:—సుగుణా !

జ.కో:—కాదు.

మూర్తి:—ఇంకెవరున్నారుచెప్మా ! సరళ.

జ.కో:—కాదు, కాదు.

మూర్తి:—అబ్బా ! చెబుదూ చంపక — తప్పకుండా పద్మావతి అయివుంటుంది.

జ.కో:—ఇంతేనా ! ఎవరో గ్రహించలేవన్నమాట... లలిత నెరుగవూ ?

మూర్తి:—లలితా ! లలితా ? (వివర్ణుడవుతాడు)

జ.కో:—ఏమీ అలా ఆశ్చర్యపోతావేమీ ?

మూర్తి:—అబ్బే—ఏమీలేదులే - నేనూ ...

ఉన్మ:—(తిరిగివెడుతూ ప్రవేశించి) నాయనా వెళ్ళి వస్తానోయి — నాన్నగారు చాలా తొందర పని మీదఉన్నారు.

జ.కో:—మంచిదండి !

ఉన్మ:— చూడు ! ఆ అబ్బాయి ఎవరో — నామధేయం ఏమిటో — నాకు ఎరుకపర్చావుకాదే !

జ.కొ:— ఆయన స్వామినాయుడుగారి కొడుకు — 'మూర్తి' అంటారు — మాతోటే బి. ఏ. ప్యాసయ్యారు — ఐ. సి. యస్.కి లండను వెడుతున్నారు.

ఉన్మ:— స్వామినాయుడుగారి కొడుకువా బాబూ ! నీవు ఒక్కడవే కాబోలు.

మూర్తి — నేనూ — మా అక్క శాంత — ఇద్దరమే.

ఉన్మ:— రావుసాహేబుగారి కూతురు లలితనిచ్చి పెళ్ళిచేస్తారుట నీకేనా ? తాంబూలాలుకూడా అయిపోయినాయిట ! మీ మామగారే ఐ. సి. యస్ చదువుకి పెట్టుబడి పెడుతారట కూడాను — నిజమేనా ?

జ.కొ:— (తెల్లబోతాడు)

మూర్తి — ఈ వివరాలేమీ నాకు తెలియవండి — వివాహం మాత్రం నేను లండను నుంచి తిరిగి వచ్చాక చేసుకోదలచాను.

ఉన్మ:— మీ అమ్మ మేనమామకొడుకు — వెనుక 1920 లో జయిలు కెళ్ళాడూ—డాక్టరుగారు — నాకు తెలుసులే — అతనితో మీ నాన్నను ఒకటి రెండుసార్లు చూసాను — వెళ్ళివస్తాను బాబూ— (వెళ్ళి మళ్ళీ తటాలున వెనుకకు) చూడూ ! కలెక్టరైనా — కాంగ్రెస్సుని, నీ దేశాన్ని మరచిపోకు సుమా ! (వెడుతాడు)

మూర్తి:— బ్రదర్ ! నేను వెడతానోయి !

జ.కొ:— మంచిది ! (మూర్తి వెళ్ళిపోతాడు) ఓ. గాడ్ ! ఐ హేవ్ లాస్ట్ ది ఛాన్స్ (అని సోఫాలో కూలబడతాడు.)

(తెర)

ఉప్పుపాట

రామరామ రామాభిరామ రామా శ్రీరామ
లోకనాయకా పావననామా లోకాభిరామ !
దండీనుండి సత్యాగ్రహులతో గాంధి వెడలెనండీ
రండి రండి సత్యాగ్రహులు రండి త్వరగ రండి
ఉప్పును చేసి ఉప్పు పన్నును ఉల్లంఘించండి !
ఉప్పు పన్నును ఉల్లఘించి ముప్పు నిలుపుకొండి
ఉన్నవానికి లేనివానికి ఉప్పు కావలెనండి
ఉప్పులేనిదే ఏ ఒక్కరికీ ముప్పు గడవదండీ !
ఆ ఉప్పుమీదనే పన్నేశాడు ఆంగ్లదొరగారు
ముప్పతిప్పలు పెడుతున్నాడు ముప్పగడవనీడు !
అబ్బబ్బబ్బ చెప్పలేమిక ఆంగ్లదొరలధాటి
అయ్యో బాబు నిలువలేమిక ఆంగ్ల ప్రభుత్వములో
రండీ రండీ సత్యాగ్రహులు రండి త్వరగరండి
ఉప్పును చేసి ఉన్న ప్రభుత్వమును ఊడగొట్టండి !

(సశేషము)




# దుష్టుడికి సహాయం చేయకండి

అనగా అనగా టుంగ్‌కో అనే ఒక పండితుడుండేవాడు. అతి దయా స్వభావం కలవాడని పేరు పొందాడు.

ఒకనాడతడు తన గాడిదమీదయెక్కి చుంగ్‌షాన్‌కు పోతున్నాడు. అలా పోతుండగా కొంతదూరంలో అతనికి కొందరు వేటగాళ్ళు కనబడ్డారు. కొద్ది సేపటికి ఒక తోడేలు పరుగెత్తుకొంటూ అతనివైపు వచ్చింది. అది భయంతో వణికిపోతున్నది. "ఓ దయామయా, నీ సంచిలోదూరి కాస్సేపు నన్ను దాక్కోనివ్వు, ఈ గండం గడిచి బయటపడ్డానంటే నీ మేలును జన్మాంతరం మరిచిపోను," అని ఆ తోడేలు వేడుకొనసాగింది.

ఆ మాటలువిన్న పండితుడు తన సంచిలోని పుస్తకాలను బయట దిమ్మరించి తోడేలును దానిలోకి దూరనిచ్చాడు. మళ్ళీ పుస్తకాలు లోపల పడేసి మామూలు సంచిలాగ తయారు చేసాడు.

ఇంతలో వేటగాళ్లు అటు పరుగెత్తుకొంటూ వచ్చారు. కాని తోడేలు కనబడకపోవడంవల్ల ఇంకొకవైపుకు పరుగెత్తారు.

వాళ్లు పారిపోయాక తోడేలు తనను సంచిలోంచి బయటికి తీయమని పండితుడ్ని వేడుకొన్నది. పండితుడు అలాగే చేసాడు.

సంచిలోంచి బయటపడ్డ తోడేలు కోరలు బయటపెట్టి ఇకిలిస్తూ ఇలా అన్నది. "వేటగాళ్ల బారినుండి నా ప్రాణాన్ని కాపాడినందుకు మీకు కృతజ్ఞురాలినే. కాని నాకిప్పుడు చచ్చే ఆకలి వేస్తున్నది. ఏదైనా తినకపోతే చచ్చిపోతాను. కాబట్టి నా ప్రాణం మళ్లీ కాపాడాలంటే నన్ను తిననివ్వు." ఇలా అంటూనే తోడేలు పండితునిపైనబడి పట్టుకొన్నది. దానిబారినుండి తప్పించుకోడానికి పండితుడు పెనుగులాడసాగాడు. ఇంతలో దారినిపోతున్న ఒక వృద్ధుడు కన

బడ్డాడు. పండితుడు ఎలాగో తోడేలు పట్టును తప్పించుకొని ఆ వృద్ధుడి దగ్గరికి పరుగెత్తి ప్రాణం రక్షించమని వేడుకొన్నాడు.

"ఏమిటి – సంగతేమిటి?" అని వృద్ధుడడిగాడు.

"ఆ తోడేలును వేటగాళ్ల బారినుండి రక్షించాను. కాని ఇప్పుడది నన్నే తినేస్తానంటున్నది" అన్నాడు పండితుడు.

ఆ మాటవిని తోడేలు యిలా అన్నది. "ఈ పండితుడు నా కాళ్లు కట్టివేసి సంచిలో పడేసాడు. పైన పుస్తకాలన్నీ పడేస్తే ఉక్కిరిబిక్కిరయిపోయాను. ఊపిరాడక నేను చావాలన్న ఉద్దేశ్యంతో వేటగాళ్లతో ఎంతోసేపు మాట్లాడాడు. అలాంటప్పుడు అతనిని ఎందుకు తినివేయగూడదు?"

"అబ్బే నువ్వు చెప్పింది నమ్మశక్యంగాకుండా ఉన్నది, ఏదీ ఒకసారి సంచిలోకి దూరి చూపించు, నిజంగానే ఉక్కిరిబిక్కిరి అయ్యావేమో చూస్తాను."

తోడేలు వృద్ధుడు చెప్పినట్టే చేసింది.

"నీ దగ్గర కత్తి ఉన్నదా?" అని వృద్ధుడు పండితుడ్ని పిలిచి మెల్లగా అడిగాడు. పండితుడు కత్తితీసి చూపించాడు. ఆ కత్తితో తోడేలును పొడిచివేయమని వృద్ధుడు సంజ్ఞచేశాడు.

"చచ్చిపోదూ?" అని పండితుడు శంకింపసాగాడు.

వృద్ధుడు నవ్వి ఇలా అన్నాడు. "ఇది విశ్వాసఘాతకపు జంతువు, అయినా నువ్వు దానిని చంపడానికి సందేహిస్తున్నావు. నువ్వు ఎంతటి దయాస్వభావుడవో అంతటి తెలివి తక్కువ వాడివి సుమా!"

ఈ విధంగా వృద్ధుడు పండితుడ్ని తోడేలు బారినుండి రక్షించాడు.

---

## తెలివి తక్కువ పనిచేసినా…

ఒకానొక చిన్న గ్రామములో రామయ్య అనే ఒక పేద కాపు నివసించుచుండెను. అతని భార్య లక్ష్మి. ఈమె మహా పతివ్రత. రామయ్య చాల అమాయకుడు. చిల్లిగవ్వయైన ఆస్తి లేదు. అందుచే ఏ పని లేక ఇంటనే ఉంటూ ఉండెను. ఈల కొన్ని దినములు గడిచిన తరువాత, రామయ్యకు జబ్బుచేసెను. తన భర్త జబ్బుతో ఉండి ఏమియు సంపాదించలేక పోవుచున్నాడని ఆమె తన పుట్టింటికి వెళ్ళెను. తల్లిదండ్రులకు లక్ష్మి ఒక్కతె కుమార్తె అగుటచే, ఆమెను పది పూటలు ఉంచుకొని వ్యాపారము పెట్టుకొనమని ఐదు వందల రూపాయలు ఇచ్చి సాగనంపిరి. శారద ఆ సొమ్మును పట్టుకొని ఇంటికి వచ్చి తన భర్త చేతిలో పెట్టి వ్యాపారమునకు కావలసిన సామాను తీసుకు రమ్మని పంపెను.

రామయ్య ఆ పామును తీసుకొని సంతకు బయలుదేరెను. సంతలో ఒకమూల ఒక పాములవాడు పామును ఆడించుచుండెను. రామయ్య దానిని చూచి "ఇది వ్యాపారమునకు బాగుండునని" దానిని ఐదు వందల రూపాయలకు బేరముచేసి ఇంటికి తీసుకు వచ్చెను. శారద ఆ పామును చూచి వెంటనే మూర్ఛపోయెను. తెలివి వచ్చినతరువాత ఇది ప్రమాదకరమని చెప్పి అడవిలో విడిచిరమ్మని, చెప్పెను. రామయ్య ఒక అడవిలో ఒక పుట్టవద్ద పామును వదిలెను. ఆ పాము మానవభాషలో ఇట్లనియె: "రామయ్యా! నీవు చాల అమాయకుడవి. నన్ను మరల స్వతంత్రునిగా చేసితివి; అందుకుగాను నీకు నేను ఉపకారము చేసెదను. అది ఏమనగా, నిన్ను మా నాన్నగారివద్దకు తీసుకు వెళ్ళెదను. నన్ను నీవు రక్షించిన విధమును మా తండ్రిగారికి చెప్పెదను. అప్పుడు మా తండ్రి సంతసించి ఒక కోరిక కోరుకొనమని మా తండ్రిగారు అడిగెదరు. అప్పుడు నీవు మా తండ్రిగారి చేతినఉన్న మహిమ ఉంగరమును అడుగుము నీకుతప్పక ఇచ్చును. ఈ ఉంగరము మహిమ ఏమనగా "నీవు ఏది తలచెదవో అది తప్పక నెరవేరునని" చెప్పి పాము నాగలోకమునకు తీసుకుపోయెను. పాము చెప్పినట్లే చేసెను. ఆ ఉంగరముతో రామయ్య చాల సంతోషముగ కాలము గడుపుచుండెను.

యమ్. సావిత్రి

—o—

## "మీసములవలన నష్టము"

మెసవిన మెతుకులు జిక్కియుంటే
పై వారెల్లరు నవ్వెదరేమో!
మురిపము మీర ముద్దులిడినచో
ముద్దియ బాధకు మూలుగునేమో!
నశ్యము బీల్చిన నాశిక చెంతను
మీసాలుంటే మురికి కాలువే!
అద్దులేక పొగ త్రాగెడువారలు
బొద్దుమీసములు సురసుర కాలిన
సద్దుచేయకను సాగుటలేదా!

కాబట్టి —
మీసాలుంటే - నష్టాలెన్నో
మీసాలుంటే - రోషాలొస్తవి
రోషాలుండి - మీసము దువ్వితె
కష్టాలెన్నో - కలవండీ!
మీసము గడ్డము బెంచినవారే
మోసము జేసెద రెందరినో! కడు
మోసము జేయును - మీసాలే!

— మరువాడ సూర్యప్రకాశం

—o—

బిచ్చగాడు ఒక యింటిముందు నిలుచొని రాగాలాపనతో పాడుతుంటాడు. ఇంతలో ఆ యింటి యిల్లాలు బయటికివచ్చి "మహా గొంతు చించుకొని పాడుతున్నావు! ఆ మాత్రం మాకు తెలుసులే_" అన్నది.

బిచ్చగాడు "అలాగా తల్లీ! అయితే మా వెంట రావచ్చు" అని పాడుకుంటూ వెళ్ళాడు.

యస్. చిరంజీవిబాబు




పొదినా ఆకును వాడ్చి తయారుచేసిన పచ్చడిని వరుసగా పదిరోజులు భోజనములో వాడిన కడుపులోని నులి పురుగులు నశించును.

గోంగూర పులుసుకూరను వరుసగా 10 రోజులు తినిన రేచీకటినివారణమగును.

మిరియపు గింజను పెరుగుతో సానమీద అరుగదీసి, ఆ గంధమును 10 రోజులు కండ్లలో వేసిన రేచీకటి తగ్గును.

పెట్టుడుమందులకు రేలచిగుళ్ల పచ్చడి విరుగుడు. వరుసగా యీ పచ్చడిని అన్నములో 21 రోజులు తినవలెను.

కామంచి ఆకు, కాయలుకూడ ఆరోగ్యాభివృద్ధికి అనేక విధాల తోడ్పడును.

కామంచి ఆకుల రసము వెచ్చచేసి చెవిపోటుకు, వాపులకు చెవులో వేసిన తగ్గును.

కామంచి ఆకును ముద్దగచేసి తలకుకట్టినను, పసరును తలకు మర్దన చేసినను, ఆకులను నీళ్లలో వేసికాచి ఆవిరిపట్టినను శిరోవాతము, దీర్ఘ జలుబులు, రొంప మొదలగు వ్యాధులు నయమగును.

కామంచి ఆకుల రసమును అప్పుడప్పుడు కండ్లలో వేసుకొనుచున్నచో రేచీకటి, దృష్టిలోపము నివారణమగును. కామంచికాడ రసము కంటి కురుపులకు, కంటివాపులకు మంచిది.

కామంచిఆకు పప్పుకూర నాలుకపూత, నిశ్శ్వాక, జీర్ణాశయములోని పుండుకు చాల మంచిది. కామంచిఆకు రసమును నాలుకకు పట్టించినను పూత తగ్గును.

నుసిరిమిరి, చెల్మి, తీట, గజ్జి, పొడలులాంటి చర్మరోగములకు ఆకు రసము చాల మంచిది.

కామంచిఆకు రసమును నువ్వుల నూనెతోగాని, కర్పూర తైలముతోగాని కలిపి వాపులకు, బెణుకులకు, వాత నొప్పులకు, పుండ్లకు పట్టించిన స్వస్థత చేకూరును.

—(౦)—

# మా ఆవిడ సరదాలు

'అరుంధతి'



అవురు అవురు మంటూ ఆరుగంట లయ్యేసరికి సంచినిండా ఫైళ్ళు పెట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ యింటి గుమ్మంలో అడుగు పెట్టగానే యింకేముంది-లాకౌట్. అమ్మగారు యెక్కడికో పెత్తనాలకు దయచేసినట్లున్నారు. హరి భగవంతుడా అనుకుంటూ చేతిలోని సంచి గుమ్మానికి జేరవేసి కూర్చున్నాను. కడుపు దహించిపోతోంది. ఎప్పుడో తొమ్మిది గంటలకు తిన్న మెతుకులు - ఒంటిగంటన్నరకు కాసిని కాఫీ నీళ్లు మ్రింగాను. వెధవ కాఫీ అది కూడా ఆముదం వాసనే. ఎదిరింటి సుదర్శనం అప్పుడే ఆఫీసునుండి రావటం అన్నీ అయ్యాయి. పేపరు పుచ్చుకుని హాయిగా ఈజీ చైరులో కూలబడ్డాడు. "ఏమండోయ్, మూర్తిగారూ! ఏమిటి మీరు రోజా కట్టలు కట్టలు పట్టుకొస్తున్నట్లున్నారే!" అన్నాడు. నవ్వుతూ. నాకు ఒళ్లు మండిపోయింది. "మీ కేమండి, మహా రాజులు కేంద్రప్రభుత్వంవారు. మీ కీలాంటి బాధలు లేవులెండి" అంటూ నేవున్నాను - వాళ్ళింట్లోంచి మా ఆవిడ చిరునవ్వు నవ్వుకుంటూ వచ్చి తలుపు తీస్తూ "ఏమండి సుదర్శనంగారు ఐదు కొట్టిన పది నిమిషాలకంతా వచ్చేస్తారు. మీ కొక్కరికేనా యేమిటి యీ ఆలస్యం?" అంది. సాగదీసుకుంటూ.

దానికి సమాధానం చెప్పడానికి కూడా ఓపిక లేదు; వెనకాలే లోపలికి వెళ్ళి ముఖం కడుక్కుంటున్నాను. "ఆయన చూడండి, రోజూ వచ్చేటప్పుడు మల్లె మొగ్గలు పట్టుకొస్తారు" అంది. సమాధానం చెప్పకుండానే మంచంమీద కూలబడ్డాను.

"ఏమండి! రేడియో సంగతి యేంచేశారు?"

"ప్రాణాలు పోతుంటే రేడియో యేమిటే?" అన్నాను విసుగ్గా.

"అది సరే ప్రాణాలు పోకుండా కాస్త పోస్తాను కాని రేడియో మాట యేమిటి చెప్పండి."

"చెప్తాను ముందర టీ తీసుకురా..."

"ఆఁ! యేమిటి తీసుకొచ్చేది నాలుగు నెలల బట్టీ అంటున్నారు. ఇదిగో వస్తోంది, అదిగో వస్తోందిఅని" విసుక్కుంటూ ఫ్లాస్కులోని టీగ్లాసులో పోసింది. మాట్లాడకుండా త్రాగేసి, "ఏమే! ఇది కాఫీయా, టీయా, ఓవల్టినా - యేమిటిది? మా దిల్ కుష్‌ను మించిపోయింది" అన్నాను.

"ఏంచెయ్యమంటారు! టీపొడుం అయిపోయింది. కొందామంటే చేతిలో కానీలేదు. వెధవది - మొదటి తేదీ యింకా పది రోజులుంది - ఏమండి! యీ నెల యెన్నిరోజులు" అంటూ కేలండరు చూచి, "ముప్ఫై ఒకటే - చచ్చాం! ఇంకా పదకొండు రోజులు గడవాలి...ఏమండి ఒకటో తేదీ ఆదివారం. ఎల్లాగండి బియ్యం యింకో వారం రోజుల కొస్తాయేమో...అదీ సరేగాని...రేడియో మాట యేంచేశారండి?"

"ఏమిటి చేసేది! మనమెంత మన తాహతెంత? రేడియో - కావాలిట - రేడియో! నీకు రేడియో కావలిస్తే చేతికున్న గాజులు, మెడలో చంద్రహారం యిలా యివ్వు- రేడియో పట్టుకొస్తాను. అయినా మనకి రేడియో యెందుకు చెప్పు? ఈ ప్రక్కవారికుంది ఆ ప్రక్కవారికుంది. ఎదురింటి వారికుంది..."

"అది కాదండి! వాళ్ళ రేడియోపాటలు నేను వినను. మంది మనకుండాలి. పోనీలెండి, ముద్దుముచ్చట యేమీలేదు. అందరూ చూడండి..."

"అవునవును అందరు ఆడవాళ్ళు యిలా వుంటున్నారా? అయ్యో! ఐదు గంటలకు అవురుమంటూ

యింటికొస్తాడు-పోనీ కాసిని-మంచినీళ్లైనా యిద్దాం వచ్చేసరికి - అనే బుద్ధి యేమైనా వుందా! ఈ జంతువు కాళ్ళీడ్చుకుని ఉసూరుమంటూ యింటికి వచ్చేసరికి వీపు పెత్తనాలు... ఏం?"

"అది సరేగాని - రేడియోమాట చెప్పండి..."

"ఏమిటి చెప్పేది-టీ పొడుం కొనడానికి అర్థణా లేదని నువ్వే అంటున్నావు-రేడియోకి రెండువందల యాభై యెక్కడినుండి వస్తుందనుకున్నావు."

"అది కాదండి. వాడెవడో వాయిదాలమీద యిస్తాడన్నాడుగా"

"ఇస్తే - మొదట వందరూపాయలు కట్టొద్దూ."
"కట్టండి..."

"మా తాత పాతర వెయ్యలేదు... పోనీ మీ నాన్న కొని యివ్వకూడదూ."

"మనకి మా నాన్న యెందుకివ్వాలి? మనమే కొనుక్కుందాం. రేపు జీతం రాగానే డబ్బు కట్టేసి రేడియో పట్టుకురండి."

"రేడియో పట్టుకొస్తాను. మనం తిండి మానేసి సంగీతం వింటూ కూర్చుందాం."

"అదంతా మీ కనవసరం. ఎల్లాగో నే సర్దుకుంటాను." అనేసరికి దాని దగ్గర యే మాత్రమోవుందనుకుని నిశ్చయించుకున్నాను.

రెండవ తేదీ రానేవచ్చింది. ఏడు గంటలకంతా యిల్లు చేరాను. తలుపుతట్టి 'ఏమే' అనేసరికి పరుగెత్తుకుంటూ వచ్చి "రేడియో పట్టుకొచ్చారా?" అంటూ తలుపు తీసింది. ఎదురుగా నేను, నా ఫైల్సు సంచి సిద్ధం. "ఏమండి రేడియో యేది? ఈ వేళ మీరు పట్టుకొస్తున్నారని చుట్టుప్రక్కల అందరికీ చెప్పాను. ఇదేమిటండి యిట్లా చేశారు. రేపు ప్రొద్దుటే అందరూ అడుగుతే యేమిటి చెప్పేది?" గుక్క తిప్పుకోకుండా అనేసి వెనకాల రిక్షావాడు పట్టుకొస్తున్న రేడియోచూచి, "పట్టుకొచ్చారూ! చెప్పరేంమరి! ఈవాళ మా నాన్నకి కూడా ఉత్తరం రాశాను రేడియో కొనుకున్నామని" అంది.

నేనేమీ మాట్లాడకుండా రిక్షావాడికి డబ్బులిచ్చేసి లోపలికి వెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కుని వచ్చి కుర్చీలో కూలబడ్డాను.

"ఏమండి టీ త్రాగుతారా?" అంది ఫ్లాస్కు పట్టుకొచ్చి.

"టీ పొడి యెక్కడిది?"

"ఎదిరివారింట్లో అప్పు పట్టుకొచ్చాను."

"ఏడిసినట్లుగానేవుంది. ఒకప్రక్క మూడువందలు పెట్టి రేడియో కొనడమూను, మరో వైపు అర్థణా టీపొడి అప్పుచెయ్యడమూను."

"సరేగాని ముందు రేడియో పెట్టండి అందరూ పెట్టుకుంటున్నారు."

చచ్చినట్లు అంతాచేసి రేడియో పెట్టాను. టీ త్రాగుతారా అందేకాని ఫ్లాస్కులోంచి తియ్యనే లేదు. అప్పుడే ఎనిమిదన్నర అయింది. ఆకలి దహించేస్తోంది.

"ఏమే, అన్నం పెడతావా?"

"అబ్బ ఉండండి - కాస్సేపు మంచి పాటలు వస్తున్నాయి తొమ్మిది గంటలకు తిందాం."

"ఆకలేస్తోందే"
"ఇప్పుడే కదుటండీ టీ త్రాగారు"
"ఇచ్చావా?"

'త్రాగలేదూ-అయ్యో. అందులోవుంది త్రాగండి"

"ఒసేయ్-కాసిని - టీ నీళ్లు త్రాగుతే యెంతే ప్రొద్దున్న తొమ్మిది గంటలకు తిన్న మెతుకులు."

"చంపేస్తున్నారండి. నడవండి-వస్తున్నా."

◆ ◆ ◆

పదిహేను రోజులు గడిచాయి. ఒకనాడు ఎంపోయిన మాగాయి, లైపిండిలా తయారైన అన్న

ముద్ద కంచంలో పడేసి చూస్తూ యెదురుగా కూర్చుంది. నాకు ఒళ్లు మండిపోయింది. "ఏమిటే యిది నీ ముఖం యేమిటీ అన్నం?"

"ఏమీ లేదండి. కుంపటిమీద బియ్యం పడేసి మంచిపాట వస్తుంటే రేడియోదగ్గర కూర్చున్నాను. కాస్త మెత్తపడింది అంతే... కలపండి. అల్లా చూస్తా రెందుకు? కూరా నారా యేమీ లేదు."

హతోస్మి అనుకుంటూ భోజనం కానిచ్చి నా ఫైల్సు సంచి ముందర వేసుకుని, "ఒసేయ్ కాస్త రేడియో తగ్గించవే. కాస్సేపు వ్రాసుకోవాలి" అన్నాను.

"ఉండండి. విధవ వ్రాత ఎప్పుడూ వుండనేవుంది. ఈనాడు క్రొత్తది కనకనా!"

"అది కాదే ఈ కాగితాలు వ్రాసి పట్టుకెళ్ళక పోతే రేపు పీకలమీదకు వస్తుంది."

"ఏమిటండి మీదంతాను! ఎవడా ఆఫీసరు- ఎవడండి రాత్రిల్లుకూడ మిమ్మల్ని ఆఫీసు పని చెయ్యమన్నది? ఎంత గవర్నమెంటు ఉద్యోగం అయితే మాత్రం - యింటిదగ్గర పెళ్ళాంతో కూడ మాట్లాడకుండా ఆఫీసు కాగితాలు వ్రాయమంటాడేమిటి? ఎదిరింటాయన చూడండి..."

"పూర్తయిందా యింకా యేమన్నా వుందా?"

"అది సరేగాని - యేమండి యెల్లుండి నా పుట్టిన రోజు..."

"అయితే?"

"ఔరంగాబాదు సిల్కు చీరండి."

"మీ నాన్నను ఐదువందలు పంపించమను - నీకు కావలసిందల్లా కొంటూవుంటాను."

"అదిగో ఆమాటే అనవద్దన్నాను ఏం - మా నాన్న యెందుకివ్వాలి?"

"నీకు యివన్నీ కావాలి కనక... అవున్లే. ఒకనాడు యిచ్చాడు కనకనా యీనాడు యివ్వడానికి! ఇంత వరకు అరకాసు ఉంగరం పెట్టడానికి లేకపోయింది"

"మహా మీవాళ్లు పెట్టేసినట్లు! గుమ్మంలోకి వెడితే ముఖాన్న బొట్టుకూడ పెట్టలేకపోయారు."

"అది సరే - తీర్చవలసిన అప్పులు యేమాత్రం వున్నాయి చెప్పు. మధ్యాహ్నం పోలీసువాళ్ళొచ్చారు."

"పోలీసు వాళ్ళా?"

"అవును పాత బాకీలు యెన్ని చెప్పు."

"ఇంటి అద్దె రెండు నెల్లది..."

"అదేమిటే!"

"ఏమిటి? క్రిందటి నెలలో మా తమ్ముడు వచ్చినప్పుడు మరి గుడ్డలు పెట్టలేదూ! ఎక్కడినుండి వచ్చాయనుకున్నారు? ఈ నెలలో నా చేతికి ఏభై రూపాయలిచ్చారు తెల్సునా?"

"ఇంకా..."

"పాలవాడికి రెండు నెల్లది. బట్టల కొట్టువాడికి పదహారు..."

"ఇంకా బట్టల కొట్టేమిటే..."

"అవును. మరి మొన్న చీర తీసుకోలేదూ! చెప్పడం మరచిపోయాను. ఆ కొట్టువాడు సుదర్శనం గార్కి తెల్సునట. ఆవిడ నేను వెళ్ళి తెచ్చుకున్నాం"

"ఇదేమైనా పట్టవాసమనుకున్నావా - మీ తాత గారి పల్లెటూరనుకున్నావా? అప్పులు పెట్టడానికి! రేపు పోలీసువాళ్ళొచ్చి తీసుకుపోతూంటే చూస్తూ కూర్చుందువుగాని- ఊరంతా అల్లరి అవుతుంది."

"జైలా?"

"అవును. ఎల్లుండి సాయంకాలంలోగా అప్పులు తీర్చకపోతే జైలు ఖాయం."

"మా నాన్నగార్కి ఉత్తరం వ్రాయండి" అంది దిక్కుముఖంతో.

"నా కనవసరం. నేను వ్రాయను అప్పులు చేసి పీకమీదకు తెచ్చింది నువ్వాను ఉత్తరం వ్రాసేది నేనా? ఒకటా - రెండా - ఐదు వందలు - జీవితంలో తీర్చగలమా?"

"మా నాన్నగార్కి టెలిగ్రాం యివ్వండి ఆయన వస్తారు."

"అంటే - మీ నాన్న కళ్లెదురుగా నన్ను జైలుకు వెళ్ళమన్నావన్నమాట."

"పోనీ డబ్బు పంపమని వెంటనే జాబు వ్రాయండి."

"ఆ రాసేదేదో నువ్వే వ్రాయి."

"ఏమని వ్రాయమంటారు?"

"ఏముంది-ఊరంతా అప్పులు చేశాను. అవి తీర్చనందున పోలీసువాళ్ళొచ్చి మా ఆయన్ని జైలుకు తీసుకెళ్తారు..."

"అదేమిటండి."

"అవును వ్రాయి. ఐదు వందలు అప్పు తీర్చవలసి వచ్చింది. ఎల్లుండి సాయంకాలంలోగా తీర్చకపోతే అరెస్టుచేసి జైలుకు తీసుకుపోతారట. అందువలన వెంటనే 500 లు పట్టుకుని రావలెను. తీసుకు రాకపోతే చాల అభాసు జరుగుతుంది."

"ఏమండి వాళ్లందరూ యేమైనా అనుకుంటారేమో?"

"ఇక్కడ ఛస్తూవుంటే అనుకోవటమేమిటే! అనుకుంటే అనుకోనీ."

◆ ◆ ◆

ఆ మూడో నాటి రాత్రికల్లా అష్టకష్టాలుపడి ఐదు వందలు తీసుకుని నురుగులు కక్కుకుంటూ మామగారు వచ్చారు.

"ఏమిటోయ్ యిదంతాను?"

ఆయన్ని చూడగానే నాకు నవ్వు, జాలి కూడ కలిగాయి: "ఏముంది - మీ అమ్మాయి చేసిన ఘన కార్యం."

"ఏమిటే అమ్మాయి! ఏమిటిది?"

"ఏమీలేదు నాన్నగారూ! అప్పులు పెరిగిపోయాయి. అందరూ పీకలమీద కూర్చున్నారు."

"ఏమోయ్! అంత తెలియకుండా అప్పులు యెలా చేశారు?"

"నాకేమీ తెలియదు మీ అమ్మాయి నడగండి. తెచ్చినదంతా దానికీ దీనికీ ఖర్చుపెట్టేసి అందరి దగ్గరా అప్పులు పెంచేసింది. రేడియోకి మూడువందలు - యింకా డబ్బు యివ్వనేలేదు - అప్పుడే రిపేరు కొచ్చింది. ఇంటి అద్దె, పాలు, పెరుగు, నూనె, బట్టలకొట్టు - ఒకటేమిటి - సమస్తమూ అప్పులు పెట్టేసింది."

"ఇలా అప్పులుచేస్తే యెల్లాగ, ఏదో వచ్చిన దాంతో సర్దుకోవాలిగాని."

"ఆ మాట దానికి చెప్పండి - యికమీదనైనా కుదురుగా వుంటుంది."

"బాగుందర్రా - బాగుంది. మీరు అప్పులు చేస్తున్నప్పుడల్లా తీరుస్తూవుండడానికి పాతరేమైనా వేశాననుకున్నారా? ఒసేయి అమ్మాయి! నువ్వొక్కత్తివేకాదు నాకు ఆడపిల్ల, ఇంకా యిద్దరున్నారు. ఇద్దరికీ పెళ్ళిళ్ళు చెయ్యాలి. ఇకపైన అప్పులుచేసి పీకమీదకు తెచ్చుకుంటే యెవరి ఖర్మ వారనుభవించవలసిందే. ఇదిగో ఐదువందలు నేను వెళుతున్నాను." అంటూ లేచాడు.

"ఇప్పుడెక్కడికి వెడతారు అర్ధరాత్రి? రేపు వెళ్ళవచ్చు."

"అబ్బే, నాకు తలమునిగినన్ని వ్యవహారాలు. ఉత్తరం చూచుకుని కరణంగారి దగ్గర అప్పుతీసుకుని యింటిదగ్గరైనా సరిగ్గా చెప్పకుండా బయల్దేరి వచ్చాను. పదకొండు గంటల బండికి వెళ్ళిపోవాలి"

అంటూ మంచం మీదనున్న కండువా తీసి భుజం మీద వేసుకుని బైటికి వచ్చేశాడు.

"భోజనం చేసైనా వెళ్ళండి" అన్నాను.

"అబ్బే. లేదు" అంటూ "నేను వెడుతున్నాను- అమ్మాయి! జాగ్రత్తగా సంసారం చెయ్యడం నేర్చుకో" అని ఆ చీకట్లో వెళ్ళిపోయాడు.

"ఏమే రేపు క్రొత్త రేడియో" అన్నాను.

"అదేమిటి - యిదో..."

"అది మనది కాదు. రాజుది ఎరువుపట్టుకొచ్చాను"

"అయితే అబద్ధాలు చెప్పి ఉత్తరం యెందుకు వ్రాయించారు?"

"నీకు రేడియో అక్కర్లేకపోతే రేపు ప్రొద్దునే డబ్బు పంపించేస్తాను"

"ఆయన యెంత బాధ పడుతాడో..."

"అంతేనేకాని మొగుడు వస్తున్నాడన్నది నీకు లేదు" "సరే భోజనానికి రండి."

# అపార్థం

‘పల్లపోతు’

—(౦)—

సరిగ్గా ఈలాంటి వర్షకాలపు చీకటి రోజులు. అంతవరకు గడిపిన ఏకాంత జీవితం దుర్భరంగా కన్పించింది. దీర్ఘకాలం నుండి జరుగుతున్న ఆలోచనలు ఆ రోజు ఒక నిర్ణయాన్ని చేకూర్చినవి. ఒంటరి జీవితముతో విసుగెత్తి, చీకాకైన హృదయంతో అతని గదికి బయలుదేరాను. వీధులు నిశ్శబ్దంగా నిద్రపోతున్నవి. ఆ నిశీధపు వేళలో ప్రకృతిమాతకు ఆభరణముల వలె కన్పించే మునిసిపల్ విద్యుత్ దీపాలు తమ శక్తికొలది చీకటిని తరిమి కొడుతున్నవి. వర్షం కొద్దిగా తగ్గింది; తుంపర్లు పడుతున్నవి. జన సంచార శూన్యమైన ఆ వీధిలో నాకు ఆహ్వానాలు తెలుపుచున్నట్లుగా ఒక గది తలుపులు తెరచివున్నవి. నిస్సంకోచముగా ఆ గదిలోకి వెళ్ళాను. అచ్చటి వాతావరణం నా ఊహకు భిన్నంగావుండి, నా కమితాశ్చర్యాన్నే గాక, అంతులేని విచారాన్ని కూడా కల్గించింది. రమేష్ పడక కుర్చీలో పండుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. గుండెతరుక్కుపోయే ఆవేదన యేదో అనుభవిస్తున్నాడని పీక్కుపోయిన మొఖం, చింతనిప్పులాంటి కళ్లు చెప్తున్నవి. మాసిన గడ్డం, మురికి కారే దుసులు, సంస్కారంలేని జుట్టు...అతని వికృతాకారాన్ని చూడలేక కళ్లు మూసుకున్నాను. నా ప్రయత్నం లేకుండానే అతని కాలివ్రేళ్ళపై బడిన నా కన్నీటి బిందువులు అతని ఆలోచనా తరంగణికి ఆనకట్టయినవి.

“ప్రమీ! ఏమిటి అర్ధరాత్రిలో ఇలా వచ్చావు?” అన్నాడు ఆత్రంగా-అందులో ఆశ్చర్యం అంతకుమించిన ఆనందం లేకపోలేదు. నేనేమీ మాట్లాడలేదు. నిశ్చలంగా అతని చూపుల్లో చూపులు గల్పి మౌనంగా నిలబడ్డాను.

“నన్ను క్షమించు ప్రమీ! చదువుకున్నప్పటికీ సభ్యతకు స్వస్తి జెప్పి, నా రాక్షసత్వంతో నీసునిశిత హృదయాన్ని గాయపరిచాను. నన్ను క్షమించు!” అంటూ నా చేతులు పట్టుకున్నాడు: ఆఖరి మాటలు పలికేటప్పుడు అతని గొంతు బొంగురుపోయింది. పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ అతని చేతులతో నా మొఖాన్ని కప్పుకున్నాను.

“నువ్వు ప్రిన్సిపాల్‌కు రిపోర్టు చేసివుంటే బాగుండేది?” అని అన్నాడు.

“ఎందుకు” అని అడిగాను అర్థంగాక;

"ఈ నీచుడు మీకు దూరమయ్యే వాడు."

"నీచుణ్ని దూరం చేసుకోవాలనిగాదు నా వుద్దేశ్యం! అతని నీచత్వాన్ని దూరం చేయాలనే నా ఆశయం."

"ప్రమీ! నిజంగా నివు వివేకివి. అజ్ఞానిగా వున్నవానికి జ్ఞానబోధ చేశావు. పస లేని జీవితానికి ఒసపోసేవు."

"అది నా విధి."

"నీ భావి జీవితాన్ని ఆలోచింపక, నీపై నిందలు మోపి, పదిమందిలో నిన్ను పరాభవించి, అన్నివిధాల నీ గౌరవమర్యాదలకు హాని గల్గించిన ఈ రాక్షసునిపై నీ కెందుకింత దయ?"

"దయగాదు...!" తర్వాత మాటలు పెగిలిరాలేదు. సిగ్గుతో మొఖాన్ని దాచుకున్నాను. మొరటుగా నా నడుమును యేదో చుట్టుకున్నది. గాఢంగా అతని గుండెల్లోకి చొచ్చుకుపొయ్యాను.

"ఆ రాత్రి అతనితో గడిపాను. అలా ఎన్ని రాత్రిళ్ళు మాకు తెలియకుండా గడచిపోయాయో సరిగ్గా గుర్తులేదు. నా సాహసానికి, గుండె నిబ్బరానికి అతను పూర్తిగా పరివర్తన మొందాడు: వెనుకటి అలవాట్లన్నీ మానుకున్నాడు. రోజూ క్లాసులకు హాజరవుతున్నాడు. ఎవ్వరితోనూ మాట్లాడటములేదు. చాలా బెట్టు సరిగా వుంటున్నాడు. ఆడపిల్లలను అల్లరి చేయటము లేదు. ఎవరైనా పలుకరిస్తే ముక్తసరిగా జవాబిస్తున్నాడు. సాయంత్రం వేళలో వూరికి దూరంగా యేదో కబుర్లు చెప్పుకుంటూ కూర్చునే వాళ్లము!...నా ఆదరణ అతని అయిన వాళ్లను మరిపిస్తున్నదనీ, తాను దైవంనుండి యేదైనా కోరేదివుంటే అది నేను తనకు ఎల్లప్పుడూ దగ్గరగా వుండటమేననీ, నా కళ్లల్లో యేవో తాను చెప్పలేని కాంతులున్నవని, వాటి వెలుగులో తన బాధలన్నీ మరచిపోతున్నానని ఎప్పుడూ అంటుండేవాడు. అతని అనురాగానికి కృతజ్ఞతగా నా ప్రాణాలతో అతని పాదాలు కడగాలనిపించేది...కాని, మానవక్షేమం కోసం నిర్మించబడిన సంఘం మా నాశనాలకు కారణమయింది. మా పవిత్రతను అన్యోన్యతను సహించలేక కుళ్లుబుద్ధితో అసూయతో తన కడుపుబ్బరతను వెళ్లగక్కింది. మమ్మల్నిచూసి వికటంగా నవ్వింది. ఆ నవ్వుల్లోని శూలాలు మా హృదయాల్లో నాటుకపొయ్యాయి. నా సాంగత్య దోషం వల్ల అతను సమాజంలో కానివాడయ్యాడు. కన్న తలిదండ్రులకు, ఇతర రక్తబంధువులకు, అన్నిటికంటే ముఖ్యంగా ప్రస్తుతం కన్పిస్తున్న డబ్బు, తదితర ఆస్థిపాస్థులకు అతను నాగురించి దూరంగావటం నా కిష్టంలేదు; అన్నిటిని త్యాగంచేసి నన్ను

వర్ణాంతర వివాహం చేసుకుంటానని చెప్పాడు. వద్దని వారించాను. నాకోసం తన భావిజీవితాన్ని పాడుచేసుకోవద్దని బ్రతిమిలాడాను. లోకం దృష్టిలో చెడుగా పరిగణించబడి, కన్నవారి హృదయాల్లో కోతబెట్టవద్దని మొరపెట్టుకున్నాను. ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించి నలుగురి నోళ్ళల్లో నీచంగా నానవద్దని బోధించాను. ఆచారాలకు వ్యతిరేకముగా సంచరించి కుల, వంశ గౌరవాలను భగ్నపరచవద్దని ప్రార్థించాను. కానీ, అతని పవిత్రహృదయంలో అంతకుముందే ఇముడ్చుకుపోయిన ఆదర్శవంతమైన ఒక శక్తి నా ప్రార్థనలను పెడచెవిన బెట్టించాయి. ప్రస్తుత సమాజంలో మానవుడు వేటిఆధారంతో హాయిగా ఆనందంగా, జీవితాన్ని గడపగల్గుతున్నాడో వాటిని నా కోసం అతను త్యాగంచేయటం ఇష్టంలేక నిచ్చింతతో, నిశ్శబ్దంగా నిద్రపోయే అతని పాదాలవద్ద మోకరిల్లి, నిశ్చల మనస్సుతో, నిర్మల భక్తితో అతని భావి జీవితాన్ని కాపాడమని దైవానికి నమస్కరించి ఆఖరు సారిగా ఒక లేఖ వ్రాసి వచ్చాను...అంతే!...'' అన్నది ప్రమీల.

"అయితే ఆయన ఎక్కడున్నాడమ్మా!" అన్నది నర్సు!

"ఏమో! ఎక్కడున్నాడో! ... ఏమయ్యాడో మళ్ళా నాకు కన్పించలేదు. కన్పిస్తాడనే ఆశ నన్నీ ప్రపంచంలో నిలిపింది" అన్నది లేడిడాక్టర్ ప్రమీల.

"ఇక్కడకు రాడా ?" అమాయకంగా ప్రశ్నించింది ఆమె మరల :

"వస్తాడు. వస్తాడనే అయినవాళ్ళంతా అంతరించినా, ఆయనకోసం అహోరాత్రిళ్లూ ... ;" తర్వాత ఏమీమాట్లాడలేదు.

నర్సు వెళ్ళిపోయింది. ఆకాశం చిల్లులు పడినట్లుగా వర్షం జోరుగా కురుస్తుంది. అప్పుడప్పుడు కళ్లు జిగేలనే మెఱుపుల కాంతులు కిటికి అద్దాలనుండి గదిలోకి చొరబడుచున్నవి. అప్పుడే పెద్దగా గర్జించిన ఉరుముల ధ్వనులు, దూరాన పిడుగు పడిన శబ్దం లేడీడాక్టర్ ప్రమీల ఆలోచనలకు ఆటంకమయ్యాయి. ఎవరో పరుగెత్తుతు తన గదివైపు వస్తున్న శబ్దం విన్పించింది : టార్చిలైటుకొఱకు సొరుగు వద్దకు వెళ్ళింది. ఒక్కసారిగా తలుపులు తెరచుకొన్నవి; చలిగాలితో నెట్టబడిన ఒక వ్యక్తి లోపలకువచ్చాడు. బట్టలన్నీ పూర్తిగా తడిసిపోయాయి. శరీరమంతా చలిచేత గాబోలు వణుకుతుంది.

"ఎవరునువ్వు?" గర్జించింది ప్రమీల.

"అనాదుణ్ణి"

"ఇక్కడ కెందుకొచ్చావు?"

"ఆశ్రయంకోసం"

"ఇది శరణాలయంగాదు, పోఁ బయటకు!"

"అమ్మా! ప్రమాద పరిస్థితుల్లో వున్నాను. కనికరించండి" అంటూ అతను తలెత్తి ఆమెను చూసేడు. ప్రమీల చేతులోని టార్చి క్రిందబడింది. ఇద్దరూ శిలాప్రతిమలవలె అచంచలంగా నిలువబడినారు. కాసేపు నిశ్శబ్దం!

"రమేష్! ... నువ్వా!"

"అవును ... నేనే!"

"కులాసాయేనా?"

"బ్రతికే వున్నాను."

"పెళ్ళిచేసుకోలేదా?"

"-లేదు"

"ఎందుకని"

"అవసరంలేదు"

"ఎందుకీవైరాగ్యం"

"కాదు. సోమరితనం! ... పేదవాణ్ణి ప్రేమించి, ఆదరించేవాళ్లు అరుదు."

"నేను నిన్ను ప్రేమించాను."

"ఒకప్పుడు నిజమే!"

"ఇప్పుడుగూడా ప్రేమిస్తున్నాను."

"నన్ను హేళనచేయుటం భావ్యం గాదు."

"నన్ను అపార్థం చేసుకున్నావు!"

"కాదు. బాగా అర్థంచేసుకున్నాను. నేను వెనుకటి ధనవంతుల గారాబ పుత్రుణ్ణిగాదు. విలాసాలకు, వినోదాలకు చిల్లపెంకులవలె వెదజల్లటానికి ప్రస్తుతం నాదగ్గర డబ్బులేదు. కనీసం నా పొట్ట నేను పోషించుకోలేని స్థితిలో వున్నాను. అలాంటివాణ్ణి ప్రేమిస్తున్నాననటం హాస్యం గాదా?"

"నాకులేని దురుద్దేశాలు అంటగట్ట వద్దు."

"సదుద్దేశాలు కల్పించుకోవద్దు."

"నిన్నొక మనిషిగా చేయాలనే నా ఆశయం!"

"పాపభీతిలేని ప్రపంచంలో మనిషిగా జీవించటం కష్టం!"

"అర్థంలేని ఆవేశంలో భవిష్యత్తును మరుస్తున్నావు!"

"ఆనందంలో, వెర్రివ్యామోహంలో భవిష్యత్తును నాశనంచేసుకున్నాను. మోసాలకు నా జీవితాన్ని బలిచేశాను."

"ఆవేశంలో అన్నవాటికి ఆలోచించి బాధ పడాల్సివస్తుంది."

"ఆఁ ఆలోచనేవుంటే బాగుపడే వాడినే!"

"ఇప్పటికైనా మించిపోయినదేమీ లేదు. నీ అభివృద్ధికి నాసహాకారం అన్ని వేళల లభిస్తుంది."

"ఎందుకీ వృధా ప్రయాస?"

"నా పవిత్ర ప్రేమను వెల్లడించు కుంటాను."

"పవిత్రప్రేమ! ... హుం పచ్చిపశు కామానికి పవిత్రప్రేమని పేరుపెట్టి ఆశలను అనురాగంద్వారా తీర్చుకోటానికి నేను వెనుకటి రమేష్‌నుగాదు. పరిస్థితులకు దానిసనయిన పచ్చిఖూనీకోరును!" ఆమె యేదో మాట్లాడబోయింది. అప్పటికే గదిలో ప్రవేశించిన పోలీసులను చూసి ఆగిపోయింది. "పట్టుకోండి పారిపోతాడు" అన్నాడు ఇనస్పెక్టర్!

"లేదు. చచ్చిసాధించేది లేకపోయినా బ్రతికి ఉద్ధరించేదిలేదు. సంతోషంగా వస్తాను పదండి"

అతను ముందుకు నడిచాడు. పోలీసులు వెంబడించారు. "రమేష్" అన్న ప్రమీల పిలుపు గాలిలో లీనమైంది!

—(०)—

# హృదయగానం

శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి

—x—

ఈ సువిశాల ప్రశాంత గంభీర పయోనిధిలో - ఈ మలయమరంద మాధురీపవన వీచికలలో
ప్రణయ సుధాతరంగిణీ ప్రవాహములలో - వలపు తలుకుల కాంతుల వెన్నెలలో

నీరజాక్షి సమాగమ నేత్రద్వయంబులో - భారభాసుర భావబంధనమ్ములలో
కలువకాంతుని మరపించు కౌగిలింతలలో - కలికివలపుల పలుకుల తేనియలలో

జలజ బాంధవ తేజ జన్మరూపంబులో - నిలయనిర్నిద్ర భావబంధురమ్ములలో
విమలమనోరాజ్య హృదయదుందుభులలో - భ్రమరసమాకీర్ణ పద్మజాతంబులో

మధురమంజుల మోహన ప్రణయరాజ్యమ్ములో - మదనసామ్రాజ్య కళాసృష్టి ఖండంబులో
ఉదయబాలా రుణారుణ కవోష్ణ రేఖలలో - హృదయ సుందరీ కరస్పర్శానంద కౌగిలింతలలో

నిరంతరానందదాయినీ ముఖావనాలోక నోల్లాసంబులో
భావతరానంద సుధాపరిపూర సుగంధ సమ్మోహి నీ భార స్తన ద్వయమ్ములో

చిరుతరహావభావ విలసన్ముఖామృత బింబాధరమ్ములో
మరపించి మురిపించి పులికింపజేయు గంధర్వ గానామృతోద్భ వగళంబులో

నవనవోన్మేష యువతీ సమాగమకాంక్షా నిమగ్న హృదయాంబుజాతంబులో
కలిసిమెలిసి గాలిలో లీనమై ఆకాశమార్గాన సంచరింతు!

# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

కారిన నీటిచారికలు నునుపైన బుగ్గలమీద చెరిగిపోవు. వెక్కిళ్లువుండీ - వుడిగివస్తూనే వుంటయి. ఏ చిరుతిండి పెట్టో వాళ్ళని సముదాయించటం జరుగుతుంది. బొమ్మల పెళ్ళిళ్ళు ఆడుకొంటూ వుంటారు. మధ్య మధ్యా కీచులాడుకొంటూనే, ఏడుస్తూనే, తిట్టుకుంటూనే, అంతలోకీ రాజీపడి, పాతవన్నీ విస్మరించి, ఎంతో సమిష్టిగా, ఆనందంగా ఆడుకొంటారు. యిలాంటివన్నీ తన కెప్పుడు సంభవించేదని? యిటువంటి ఆనందపూరితమైన అనుభవాలు యింకా ఎప్పుడూ సంప్రాప్తించేది? మనస్ఫూర్తిగా ఎప్పుడు అటువంటి వాళ్లని ఎత్తుకు పెంచేని? కళ్యారాముని తమ్ముళ్ళ చెంకేది యింకెప్పుడూ?' శారద ఆవేదనతో ఆలోచిస్తూండేది. వింత వింత ఆలోచనలతో తియ్యని కలలు గనేది. అవన్నీ తన అనుభవాలే అయిపోయినట్లుగా భావించుకొని, పరాయివాళ్ళ పిల్లల్ని ముద్దాడుతూవుండేది. లక్కపిడతలు బొమ్మలు, నారాయణరావుతో తెప్పించి యిస్తూ వుండేది. ఆడపిల్లలకు తలలు దువ్వి, జడలువేసి పరాయి పిల్లలనే భావం పూర్తిగా మర్చిపోయి, 'తన' అనే దృష్టితో, ముస్తాబు చేసేది. దగ్గరగా కూర్చోబెట్టుకొని, వెండిగిన్నెలో పెరుగన్నం కలిపి పెడుతూ వుండేది. చుట్టూవున్న అమ్మలక్కల పిల్లలంతా శారదకు చనువైపోయారు. రోజుకి ఒక్కమారైనా బిలబిలమంటూ శారద దగ్గరకు వస్తూవుండేవాళ్లు; వచ్చిన వాళ్ళని వూరికే పంపటం మనస్కరించక యేదో ఒకటి తింటానికి పెట్టి సరదాగా వాళ్ళతో, ఆ మాటా - యీ మాటా కూడా బల్కి, తృప్తి పడుతూండేది. ప్రొద్దు కుంకుతూండగా ఎవరిళ్ళకి వాళ్లు వెళ్లేసమయంలో శారద బెంగగా చూస్తూ, తనకి పిల్లలు లేకపోవటం గుర్తుకొచ్చి కంట తడిపెట్టుకునేది. నారాయణరావు ఎప్పుడైనా ఆవేళప్పుడు యింటికొస్తే, దగ్గరగా వెళ్ళి గుండెలమీద తల ఆనించుకొని బిట్టుగా విలపించేది. అతను తన దృష్టిని భార్య ఆలోచన మీదకు పోనిస్తూ, ఓదారుస్తూండేవాడు. అడపా - తడపా పట్టణం వెళ్ళివచ్చినప్పుడల్లా శారదకు వుత్సాహం కల్గించే పిల్లల నిమిత్తం ఏ బిస్కట్లు పొట్లాన్నో, మరే యితర చిరుతిండో తెచ్చి యిస్తూండేవాడు. తనకి పిల్లలు లేకపోయినా, చుట్టూ వుండే అమ్మలక్కల పిల్లలు, తన యింటికొచ్చి ఆడుకొంటుంటె, నారాయణరావుకి, వచ్చిన ఆ పిల్లమూకంతా 'తనా' అనే భావంతోనే చూసుకొంటూ వుండేవాడు. పిల్లల సరదా తీరటం కోసమేనేమో! అన్నట్లు వీరభద్రం ప్రయివేటు స్కూలు కూడా పెట్టాడు.

శారద తరచు పనిపాటలన్నీ ముగించుకొన్న తరువాత వీరభద్రం వున్నచోటుకివచ్చి, పాఠాలు చదువుకొంటున్న పిల్లల్ని చూస్తూ నిలబడుతూండేది. కొందరు వొప్పజెప్పిన పాఠాల్ని చూడకుండా వ్రాస్తూండేవాళ్లు. కొందరు నిలబడి రాని పాఠాన్ని వల్లెవేస్తూండేవాళ్లు. మరికొంతమంది ఎక్కాలు చదువుతూండేవాళ్లు. యింకా కొందరు దిక్కులు చూస్తూ అచ్చటా - ముచ్చటా పిచ్చికబుర్లు చెప్పుకొంటూవుండేవాళ్లు. ఒంటికనీ, రెంటికనీ, పోయేవాళ్లు పోతున్నారు. వచ్చేవాళ్లు వస్తున్నారు. 'పుస్తకాలు చింపాడ'ని ఒకడు వీరభద్రంకి ఫిర్యాదు చేస్తున్నాడు. 'నా జడ లాగుతున్నాడు చూడండి మేస్టారూ'- అని ఒకఆడపిల్ల కోపంతో వీరభద్రంవంక చూస్తూఅంటోంది. 'నా బలపం విరగ్గొట్టాడండీ!' అని ఒకడు ప్రక్కవాణ్ణి తిన్నతిండి కక్కేటట్టు గుద్దాడు. 'సాయంత్రం చెచ్చా లాడుకొందామా'-అని ఒక సోమరిపోతు

ప్రక్కవాణ్ణి చదువుకోనివ్వకుండా చేస్తున్నాడు. "నిద్రపోతున్నావా? ఉండు మేస్టారితో చెబుతా" అని ఒక ఆడపిల్ల లేచి, విసురుగా వీరభద్రం దగ్గరకి వస్తూ దారిలో మరొకడి ముందున్న సిరాబుడ్డిని 'ఫడేల్'మని తన్నింది: దాంతో ఒకడి గుడ్డలు పాడైనయి. వ్రాసుకొన్న కాపీ పుస్తకం సిరాతో తడిసి పోయింది. వాడు ఏడుస్తున్నాడు. 'చెబుతా'నంటూ వచ్చిన ఆడపిల్లకు ఏంచెప్పాలో తోచక, అక్కడే చతికిలబడి, వొలికిన సిరాను ఎత్తడానికి ప్రయత్నిస్తోంది. ఒకడు సినిమా బొమ్మల పుస్తకం తెచ్చి ఆడపిల్లలందర్నీ దగ్గరకు చేరదీసి, 'నువ్వు అంజలీదేవిలాగా వున్నావు. నువ్వేమో భానుమతివి. వీడు నాగేశ్వరరావులాగే వున్నాడు. వీడేమో తోటరాముడు.' అని మొగపిల్లల్ని కూడా చూపుతున్నాడు. అందరూ చదువులు మాని వాళ్ళలో వాళ్లు సినిమా బొమ్మల్ని గూర్చి చెప్పుకొంటున్నారు. మరి కాసేపటికల్లా ఆ పుస్తకం తెచ్చినవాడి లేతవీపు వీరభద్రం చేతిలో పెసరట్టు తేలినట్లు తేలింది. వాడు 'అమ్మో - బాబో' అంటూ పుస్తకం దాచేసాడు. అంతే ఎక్కడివాళ్ళక్కడ గప్‌చిప్ - చదువుల్లో మునిగారు. శారదకు యీ దృశ్యాలన్నీ చూడ ముచ్చటగా వున్నయి. వీరభద్రం, ఆ బొమ్మల పుస్తకం తెచ్చినపిల్లవాణ్ణి అంత దెబ్బకొడతాడని అనుకోలేదు. కళ్ళు చిడతలారినయి. సిరా పారబోసిన ఆడపిల్ల చేతులు యీత బెత్తంతో వాతలు తేలినయి. శారదకు కళ్ళు చెమ్మగిల్లినయి. నిద్రపోతున్నవాణ్ణి ఒక్కగదుము గదిమాడు. శారద వులిక్కిపడింది. బలపం విరగ్గొట్టినవాణ్ణి పిల్చి తొడపాశం పెట్టాడు. వాడు మెల్లిగా మొదలెట్టిన ఏడ్పుని, సైరన్ కూతలాగా పెద్దదిచేసి, తగ్గించాడు. శారద ద్రవించింది. వీరభద్రం గూడ కట్టు కట్టుకొని కుర్చీలో కూర్చొని సిగరెట్ కాలుస్తూ లెఖ్ఖలు చెబుతున్నాడు. శారదకి యిక అట్టేసేపు వుండబట్టలేక, ఆనాడు పిల్లలంతా వెళ్ళిపోయిన పిదప, తన వాటాలోవుండి వీరభద్రాన్ని 'బావా'! అని కేకవేసింది. అతను లేచి, తలదువ్వుకొని, - మెల్లిగా శారద వున్నచోటుకొచ్చి, ఒక కుర్చీలో కూర్చున్నాడు.

"అట్లా పిల్లల్ని చావ చితక్కొడుతున్నావ్‌గదా! బ్రతకటానికేనా?"_అని అడిగింది.

"లేకపోతే చదువెట్లా అబ్బుతుంది?"-అని సమాధాన మిచ్చాడు. శారద యింకేం మాట్లాడలేదు; కాని ఆమె ముఖంలో తను చేసే హింసాకృత్యాల తాలూకు బాధ — ఆవేదన ఎందుకో వున్నట్లు గ్రహించేశాడు. యికముందు తానట్లా ప్రవర్తించటం బాగుండదనుకొని, వీరభద్రం-

"ఏదో పొరబాటైపోయిందిలే యికనుంచి ఏపిల్లల మీద చెయ్యిచేసుకోను. అనవసరంగా నీ మనస్సు కష్టపెట్టాను. నీకు పిల్లలంటే యింత మక్కువని యీ వరకూ తెలుసుకోలేకపోయాను. పశువుగా ప్రవర్తించాను. క్షమించు శారదా!"-అని కాస్త దైన్యభావంతో అన్నాడు. తన మనస్సులోని బాధనూ - ఆవేదననూ యింత సులువుగా అర్థంచేసుకొని. మనసుని మార్చుకొన్నందుకు వీరభద్రంని చూసి, శారద సంతోషించింది. అక్కణ్ణుంచి, వీరభద్రానికి, తనకి పిల్లలమీద ఎంత మక్కువగల్గివున్నదో తెలియపర్చింది. 'నీదగ్గర కొచ్చేపిల్లలంతా నావాళ్లేనని' వూహించుకొంటున్నానంది. 'అలా కొంతకాలం పిల్లలతో కాలక్షేపం చేస్తే నన్నా సంతానం కల్గుతుందేమోనని ఆశపెట్టుకొని వూరటపడుతున్నానని' కూడా చెప్పింది. "తన జీవితంలో దిగడిపోయిన కోరిక, సంతానం లేకపోవడ మొక్కటేనని" పదేపదే వ్యక్తీకరించటమే కాక, స్పష్టీకరించింది కూడా అలా శారద చెప్పుకొన్నూ కంట తడిపెట్టింది. వీరభద్రం కూడా మొసలి కన్నీటి మాటలతో ఓదారుస్తూ_

"నువ్వలాంటి దిగులేమీ పడకు. అదృష్టం తోసుకు రావాలేగాని, పిల్లలెంత సేపట్లో పుడతారూ_" అన్నాడు. ఆ మాటతో శారదకు కాస్త ధైర్యమొచ్చింది. వీరభద్రం వచ్చి అప్పటికి అర్నెల్లు

దాటింది. ఎంతో స్వతంత్రం అతని కాయింట్లో ఏర్పడింది. నారాయణరావు వున్నా లేకపోయినా, వీరభద్రం, శారదకు అండదండగా వుంటూవున్నాడు. బంధురీత్యా వీరభద్రం మెలగటం సన్నగిల్లిపోయింది. శారదను వుత్సాహవంతురాలినిగా చేయాలని తలంపు కల్గింది. పాతకాలపు భావాలతో నారాయణరావుని పూజిస్తున్న శారదను, నవీన భావాలతో మార్చివేయాలనే ఆకాంక్ష ఏర్పడింది. సినిమాలు చూడటానికి ప్రయత్నించని శారద, వీరభద్రం మాటల రీతిలో, సినిమాలు చూడాలనే అభిలాష కల్గింది. నేత చీరెలు కట్టి, ముఖానింత అర్థరూపాయి మందంగా కుంకుమ బెట్టే శారద, వీరభద్రం చెప్పి మారిపోసే క్రొత్త అలంకరణలతో, వాయిల్ చీరెలు, సిఫాన్- సిల్కు చీరెలు కట్టడం నేర్చుకొంది. తిలకం సన్నగా ఆశ్చర్యార్థకం లాగా పెట్టుకోవటం చేస్తోవుంది. నారాయణరావు, తన భార్య శారదలో కల్గుతున్న మార్పులికి వేరేదురభిప్రాయమేమీ పడకుండా, ముచ్చటపడుతూ వుండేవాడు. కాలానుగుణ్యమైన మార్పులు రావటంవల్ల ఏ ఆటంకమూ పెట్టలేదు. వీరభద్రం తన సంసారానికి ఎంతో ఉపకారిలాగా వుంటున్నాడని నమ్మివేశాడు. చేతికందుబాటులో వుంటూ, ఏ పని చెపితే ఆ పనల్లా చేస్తూన్నవాడని విశ్వసించాడు. దిక్కులేనివాడికి జీవనోపాధి కల్పించటం, తనవల్ల ఎలాగో జరిగిందని తృప్తిపడ్డాడు. ఎంతో హితుడైనందుకూ — సంతోషించాడు. పిల్లలు గల యిల్లు కాకపోయినా, వీరభద్రం చలవవల్ల పూరిలో పిల్లలంతా తనింట్లో అస్తమానమూ అల్లరిగా చదువుకొంటూ గోలచేయటం, ఎంతో ఆనందదాయకమని మురిసిపోయాడు. అంతేగా మరి! లేకపోతే వీరభద్రం విరాట్ స్వరూపం, నారాయణరావు కేంతెలుసు? శారదకేంతెలుసు?

వీరభద్రం స్థితిగతులు క్రమేపీ కృతిమించి రాగాన పడటం మొదలెట్టేసియి. చాకలివుతికి తెచ్చిన బట్టల్ని కట్టుకోవడానికి అలవడిన నారాయణరావు దంపతుల్ని యిస్త్రీబట్టలు కట్టుకునేలాగు చేసాడు. అయితే నారాయణరావు అంత చెప్పుడు మాటలు విని ప్రవర్తించే రకమా! శారద భర్తకోసం - అతని ఆనందంకోసం తా పత్రయ పడుతూండేది. పడకగదిలో అమర్చిన దేవుడి పటాలను, కొన్నింటిని మండువాయింట్లోకి మార్పించి, ఆ స్థానంలో సినిమా తారల ఫొటోల క్యాలండర్లను తగిలించాడు. గోడకు ఖాళీవున్న చోటల్లా ఒక్కో మేకుకొట్టి, పొడరు తాలూకా బొమ్మల క్యాలండర్లనూ - సబ్బు తాలూకు బొమ్మల్ని - తగిలించాడు. ముఖ్యంగా ఆ బొమ్మల్లో వైంగిక విజ్ఞానాన్ని గుర్తుచేస్తూ మానసికమైన వుద్రేకాన్ని కల్గించేటట్లుగా వున్నయి. క్రొత్త క్రొత్త పత్రికలను దగ్గర్లో, ఒకమైలు దూరంలోవున్న ఒక మాదిరి బస్తీనుండి కొని తేవటం సాగించాడు... ఆ పత్రికల ముఖచిత్రాల్ని చూస్తుంటే, కొనాలనిపించేటట్టు చేస్తయి. వీరభద్రం యిలాంటి సెక్సు పుస్తకాల్నే కాక, మరికొన్ని చెత్తపుస్తకాల్నికూడ తెచ్చి, నారాయణరావుకి తెలిసీ తెలియకుండా యిచ్చి, చదువుకోమని చెపుతూండేవాడు. అక్కడికీ ఒకనాడు భోజనాలు చేస్తున్న సందర్భంలో నారాయణరావు, వీరభద్రాన్ని వుద్దేశిస్తూ —

"మా యింటిని రానురాను బస్తీకొంపగా మారుస్తూన్నావేమిటి?" అన్నాడు. వీరభద్రం, ఏరకంగాను జంకక —

"ఇల్లు చూడ్డానికి అందంగా లేకపోతే, యింట్లో వాళ్లు అందంగా ఎలా వుంటారండీ! ఆనందం ఎలా కల్గుతుంది? యింకా పాతకాలంలో ఎన్నాళ్ళుంటాం చెప్పండి" వీరభద్రం నిర్భయంగా వుపన్యాసం చెప్పటం సాగించాడు. ఆ పూటకి భోజనాలైనయి. వీరభద్రం తన వాటాలో కొచ్చేసి దర్జాగా పడుకున్నాడు. యింకా తిండి తినటానికి పోయిన బడిపిల్లకాయలు తిరిగి రాలేదు. మధ్యాహ్నం అవుతోంది.

శారదకూడా నెమ్మదిగా అన్నం తిన్నది. నారాయణ తన పనిమీద ఎటో వెళ్ళిపోయాడు. పడుకొన్న వీరభద్రం మెల్లిగాలేచి, తన పెట్టెతెరచి, తెచ్చిదాచిన క్రొత్త క్రొత్త సెక్సు పుస్తకాల్ని, రెండు పొడరు డబ్బాల్ని, రెండు స్నో సీసాల్ని,

యిలాంటి అలంకరణ సామాగ్రిని చేతపట్టుకొని, తీసు కొచ్చి, పక్కనే నిలుచున్న శారద మంచంమీద వుంచాడు. శారద చటుక్కున లేచి - వింతగా చూస్తూ, ముందు పడివున్న సామానును పక్కకి నెట్టుకొంటూ—

"ఇవన్నీ ఏమిటి బావా?" - అని ప్రశ్నించింది. తొణక్కుండా బెణక్కుండా వీరభద్రం, శారద ముఖంలో ముఖం వుంచుతూ, "నీ కోసమే తెచ్చాను శారదా!" - అన్నాడు.

ఆమె ఉలిక్కిపడింది. కొంచెం జంకింది. తప్పు చేసినదానిలాగే చూసింది. అతను కీచకుడిలా నవ్వుతున్నాడు. సెంట్ సీసా ఒకటి జేబులోంచితీసి, ఆమె కివ్వబోతూ —

"రాణిలా శారదా!" - తీయగా అన్నాడు. నోట్లో కొడుతున్న కిళ్ళీ వాసన మత్తుగా వచ్చింది. ఆమె వాటివంక చూస్తూ "ఎవరు తెమ్మన్నారు?" - అంది.

"వీటిని తెమ్మనమని ఒకళ్ళు చెప్పాలా? నీకు ఎలాగూ లేవని తెలిసి తెచ్చాను. నారాయణరావు అన్నగారితో చెప్పినా యివ్వేగా తెచ్చిపెట్టేవి. అందువల్ల ఎవరు తెస్తేమాత్రం ఏముందిలే అని, నేనే తెచ్చాను. ఏం? కోపం వచ్చిందా? అను మానం వేస్తోందా? చెప్పు శారదా?" - సూటిగా చూస్తూ అడుగుతున్నాడు.

శారద నోరు మాటాడలేదు. "యివన్నీ ఎవరు చెప్తే తెచ్చావు?" - అనే ప్రశ్న ఆమెను నిలవ నీయటంలేదు. "ఒకవేళ మాట వరుసకు, తన భర్త ఏమైనా అన్నారా?" - సందేహించింది.

"అంటే మాత్రం వీరభద్రం, తనతో చెప్పకుండా వెళ్ళి బుడబుడా తేవటమేనా? తెచ్చాడు, బాగానేవుంది. భర్తలేని సమయంచూసి యిట్లా తన మీద మీదకొస్తూ, తీసుకోమనటం భావ్యమేనా?" - తీవ్రంగా దీర్ఘాలోచన సాగిస్తోంది. "వీరభద్రం యిలా ప్రవర్తిస్తాడని తను అనుకోలేదే!" తనలో తాను వితర్కించుకొంది.

వీరభద్రం అలాగే సిగ్నల్ స్తంభంలాగా నిలబడి వున్నాడు. పిల్లలింకా రాలేదు. వస్తే బాగుండును అనుకొంది. రావటంలేదు... పరిస్థితి అగోచరంగా తోచింది. అతని హృదయంలోని ఆ కాంక్ష ఏమిటో అర్థంకాలేదు. కాసేపు స్థిమితంగా వుందామనుకొంది. వీరభద్రం వున్నచోటునుంచి కదలటంలేదు. వెళ్ళి పొమ్మని చెబుదామనుకొంది. మాట గొంతుక పెగలి రావటంలేదు. శరీరమంతా చెమటలు చిరుచిరుగా పోస్తున్నాయి. సుడిసి, సుడిసి గాలివీస్తోంది.

నారాయణరావు అప్పటికీరాలేదు. 'ఒకవేళ వస్తాడేమో!' అనుమానించటం మొదలెట్టింది. తీరా వచ్చి యీ భాగోతంచూసి ఏమనుకొంటారో! భయంవేయసాగింది. 'మోసంచేస్తున్నానని' అపార్థం చేసుకొంటారేమో!' హృదయం గజగజ వణికి పోతోంది. తెగిపోని ఆలోచనలు ఆమెను, నులిమి వేస్తున్నాయి. కానరాని గాయమేదో కలకవేస్తున్నట్లుంది. ఏదో అశేషన భయోత్పాతాన్ని కలిగిస్తోంది. ధైర్యం దిగజారిపోతోంది. చేతులారా తన పంటంటి సంసారాన్ని కూలదోసుకొంటున్నానేమోనని తర్జన భర్జన చేసుకోవటం ప్రారంభించింది.

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧౫

సురకుముదాళి, సంబరమునఁ దేల్చెడి
చంద్రుండు; దానవ సరసిజముల
చంద్రుండు; యోగుల జ్ఞానచంద్రుఁడు; పాప
చీకటుల్ బోకార్చి - చెలువ మొసఁగు
చంద్రుండు; జానకీ సతియొక్క కలువ నే
త్రములకుఁ జంద్రుండు; రక్తిభక్తు
లయినట్టివారి, నయనకుముదాళికిఁ
జంద్రుండు; దశకంఠ సరసిజంబు
నడచు చంద్రుండు; శ్రీరాముఁడనఘమూర్తి
చంద్రువలె వెల్గు శ్రీరామచంద్రమూర్తి
యట్టి శ్రీరామచంద్రుఁడిక్కట్టుమాన్పి
హర్ష మొనగూర్చి రక్షించు ననుదినంబు

౧౬

బంధు దుగ్ధాబ్ధికిఁ బావన చంద్రుండు
సజ్జనకుముదాళి చంద్రముండు
జానకీస్తన యుగ్మచంద్రుండు; శత్రుల
ముఖపద్మ చంద్రుండు; ముద్దుగాఁగ
సత్కీర్తి చంద్రుండు; సకలలోక ప్రకా
శ మొసఁగు చంద్రుండు; సంతతంబు
ముద్దుగా వికసిత - ముఖచందురుండవే; శ్రీ
రామచంద్రుఁడు యోగిరాజ మనము
లనెడు కలువల వికసింపఁగనెడు చందు
రుండు; దశరథేశ్వరుకోమ - రుండు నిండు
చందురుండు, శ్రీరాముండు సంతసమున
నాదు సేవలఁ గొనుగాత ఖేదముడిపి.

౧౭

రాక్షసప్రముఖుల ప్రాణముల్ హరియించు
శరములఁ బ్రత్యుపసంహారంబు
సల్పుచు, ధనువున సంధించి హస్తముల్
వీరప్రతాపుఁడై వెలసినావు:
దశకంఠ కంఠఛేదన కాండఁ గదళికా
కాండంబుఁ ద్రుంచెడి కరణిసల్పి
యంగజదర్పంబు హరియించినట్టి, ఈ
శ్వరుని రూపంబుతోఁ బ్రజ్వరిల్లి
రామ! మునులసంస్తుతులంది ప్రబలినావు,
శిష్టజనరక్షణంబును దుష్టశిక్ష
ణంబు, నీ యవతారఫలంబుగాదె?
రక్షణము, సేయుమయ్య ప్రహ్లాదవరద!

౧౮

నారిబాణమును, కర్ణాంతపర్యంతంబు
లాగుచుఁ బ్రళయకాలస్వరూపుఁ
డైన, యముండవై, యబ్జనేత్రప్రాంత
మెఱుపు, వహింపగా - వినతశేష।

పౌలస్త్య రాక్షస ప్రభలడగింపగా
బహుచిత్రభంగిని బాణములను
హాస్తనైపుణ్య ప్రశస్తభావముతోడ
సంధించి విడిచి, రాక్షసులఁజంపి
దేవతాళికి ముదమిచ్చి దివ్యుఁడగుచు
వెలుగుచున్నావు శ్రీరామ! వీరుఁడగుచు
నిన్ను భజియింతు నిత్యంబు నేమముగను
నన్ను రక్షింపుమయ్యా! సంపన్నచరిత!

౧౯

మృత్యువెన్నంటి, డగ్గఱిమ్రింగ, రాగఁ
దల్లి లేదు, పుత్రులు లేరు, తండ్రి లేదు,
తోడఁబుట్టినవారు, బంధువులు లేరు;
రాముఁడే, నన్ను రక్షించు రక్షకుండు

౨౦

ఇంద్రరథంబెక్కి, హితమతి నాతఁడొ
సంగిన టెక్కెంబు సరగఁబూని
రథము, నారోహించి-రణపరాక్రమముతో
భుజములఁ జఱచి, కన్బొమల విఱచి
సాహసంబున, ధనుష్టంకార మొనరించి
శత్రుభయ మొనర్చి, సరసలీల
తూణీరబాణముల్ దొరగించి, రావణ
సంహారము నొనర్చి, శౌర్యధుర్య!
రామ! వీరప్రతాపుఁడై - రణమునందుఁ
గానబడినావు; నీ రూపుఁగాంచవశమె?
బ్రహ్మరుద్రాదులకు నేని? భక్తవరద!
శాంత రూపంబుతోడఁ బ్రసన్నుడగుము

౨౧

కనక రుచిరచేలముగల్గి, కర్ణకుండ
లములచేఁ బ్రకాశించి విరాజ రుచిర
మణికిరీటముఁదాల్చి, సొంపారు, భ్రూ, ల
లాటమునుగల్గి, విమలజలదము బోలు
నీల దేహంబుతోడ వన్నియకు నెక్కు
రామ! శేషశాయి! రఘుకులప్రదీప!
నిన్నుధ్యానింతు సతతంబు నెమ్మనమున
నన్ను రక్షింపు శ్రీరామ! నాగశయన!

౨౨

శ్రీవత్స చిహ్నంబుచేఁ గౌస్తుభముచేతఁ
బీతాంబరముచేత వెలసినావు
బహురత్నములచేత - భాసిల్లు చున్నట్టి
మకుటంబు, మందారమాలికయును
దాల్చితివీవు; కోదండధారి! ముకుంద!
కోటిమన్మథ తేజ! కువలయేశ!
నీలమేఘశ్యామ! నిగమవందితపాద!
సీతతోఁగూడిన - శ్రీశుభాంగ!
సారకస్తూరి ఘనసార చర్చితాంగ!
నిత్యశోభిత! శ్రీరామ! సత్యచరిత!
నిన్ను సతతంబు సేవింతు నీరజాక్ష!
నన్ను మన్నించి రక్షింపు నాగశయన!

౨౩

రామ! నీ నామంబు - రాక్షసస్త్రీ గర్భ
విచ్ఛేద మొనరించు; వినుతశీల!
స్మరణచేసిన నిన్ను - చండాలుఁడేనియు
ముక్తిఁగాంచును కాదె! భక్తసులభ!

వేదసన్నిభమైన - విఖ్యాతి నార్జించె
రామ! నీ నామ మీ భూమియందు
ఇతర సహస్రంబు లింపారు నామంబు
లెన్ని పఠించిననేమి? రామ!
నీదునామంబునకు సాటిరాదు, రామ
యనుచు నొక్కసారి పఠింపనఘములుడుగు
రామ! నీదు నామామృత సోమపాన
మబ్బఁజేయుము; ప్రార్థింతు ననుదినంబు

౨౮

రాక్షస మర్దనా! రఘువంశ తిలకమా!-
దితిపుత్ర నాశనా! ధీర! రామ!
భయమునుహరియించి-భక్తుల కభయంబు
చేకూర్చుచున్నట్టి శ్రీశుభాంగ!
ఇంద్రుభయము, హరియించి, సుగ్రీవుని
కిష్టుండై, ఘనరాజ్యమిచ్చినావు
పాపరాసులనెల్ల - ధ్వంసంబొనర్చుచు
నాంజనేయుని స్తోత్రమందినావు
శార్ఙ్గధారివి, శ్రీరామ చంద్ర! భక్త
వరద! సీతాసమేతుండై వఱలునిన్ను
భజనసేతును సతతంబుఁ బరమభక్తి
మానసానందమిమ్ము; రమావినోద

(సశేషము)

(624-వ పేజీ తరువాయి)
వున్నందుకు క్షమించు. ఇలా చేయటం నా తప్పే...నువ్వు దగ్గర లేవు ... భరించ లేకుండా వున్నాను. ఏం చెయ్యటానికి పాలు పోక ...'' నేలకేసి చూస్తూ, హడలి పోతూ అన్నది.

''ఏం అలా అదరిపోతున్నావు? నేను లేకపోవటం చూసి గాలి రాద్ధాంతం చేస్తూ వుందా?'' అని దానిని ప్రేమతో తడుముతూ అన్నాడు అబ్బాయి.

''ఆ గాలికి భయపడుతానని అనుకుం టున్నావా? అలా గాలి వుండటం ఇప్పుడు అవసరమే...''

''అంటే జంతువు లేమన్నా...?''

''రెండు మూడు జంతువులు నన్ను బెదరించటానికి వచ్చాయి! కాని అవే కంగారుపడి మాయమైపోయాయి, నా ముళ్లనిచూశాక...''

ఆ మాటతో అబ్బాయి తట్టుకో కలి గాడు. ఆ మొక్క కేసి చూసి చిరునవ్వు నవ్వసాగాడు.

''ఆ లోకంలో ఎంతకాలం వుండిపో వాలని నీ వుద్దేశ్యం? మమ్మల్ని ఇలా ఒంటరిగా విడిచిపెట్టి అలా వెళ్ళిపోవటం.. అలా వెళ్ళిపోవాలనుకుంటే ... అక్కడే వుండిపో!'' అని అంటూ మొక్క ఒకిపెట్టున కంట తడిపెట్టుకుంటూ ఏడ్వసాగింది. ఆ మొలకకి వ్యక్తిత్వం అనేదివుంది. దానిని నిలువబెట్టుకోటానికే అది ఇలా సతమతమై పోతున్నది .... ...

దీంతో నా ఒళ్ళో పడుకుని తియ్యా తియ్యని కలలని కంటూవున్న అబ్బాయికి మెలుకువ వచ్చింది. కళ్లు తెరచి నలు ప్రక్కలా ఆదుర్దాతో చూడసాగాడు.

---

# పాకకళ

## కూరగాయల కట్‌లెట్

2½ పలముల క్యాబేజి, 4 క్యారెట్ దుంపలు, 3 బంగాళా దుంపలు, కొంచెము బీన్సు సన్నగా తరిగి తగు మాత్రము నీరుపోసి, అందులో కావలసినంత ఉప్పు, చిటికెడు పసుపుపొడి వేసి ఉడికించి యుంచుకొనవలెను. రెండు రొట్టెముక్కలనుగాని, రస్కులనుగాని ఎర్రగా కాల్చి పొడిచేసికొని యుంచు కోవలెను. ఉడికించిన కూరముక్కలను మెత్తగా రుబ్బి చిన్నచిన్న గారెలుగాచేసి రొట్టెముక్కల పొడి గాని, రస్కుల పొడిగాని అద్ది పొయిమీద కాగుతున్న నెయ్యిలోగాని, నూనెలోగాని తేల్చాలి. ఎర్రగా కాలినవి వేడిగా రుచికరముగా నుండును.

మజ్జి వెంకటలక్ష్మి




## ఎండమావి చలన చిత్రీకరణ

సోవియట్, చైనీస్ సినీ ఫొటోగ్రాఫర్లకు వాయువ్య చైనాలోని జుంగార్ యెడారిలో హఠాత్తుగా ఒక ఎండమావి ఒక సరస్సులాగనూ, చుట్టూ పొదలున్నట్లుగానూ కనిపించగా దానిని ఫిల్ముతీసారు. ''అల్మా - అటా - లూంచే'' అనే సంయుక్త సీనో - సోవియట్ పెద్ద - వర్ణచిత్రంలో ఇలాంటి అపురూప దృశ్యాలుంటాయి. వాయువ్య చైనాలోని ప్రకృతి, వృక్ష, పశు పక్ష్యాదుల గురించి ఈ ఫిల్ములో చిత్రింపబడుతుంది. సహస్రబోధిసత్వాల గుహాలలోని ప్రాచీన చైనీస్ కళాసంపద కూడా యిందులో చిత్రింపబడుతుంది.

———o———

జయంతి పిక్చర్స్‌వారి 'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రము ఆంధ్రదేశమంతటా యీ నెల 17వ తేదిన విడుదల కాబోతున్నది.

◆ ◆ ◆

శ్రీ జగ్గయ్య, రమణారెడ్డి, కుటుంబరావు, రాజసులోచన, హేమలత, కుమారి జమున మున్నగువారు నటించిన విశ్వరూపావారి చిత్రము 'కూతురు కాపరం' పూర్తి కావచ్చింది. దీనికి శోభనాద్రిరావుగారు దర్శకులు.

◆ ◆ ◆

ప్రమోద ఫిలిమ్స్‌వారు 'వేములవాడ భీమకవి' చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

◆ ◆ ◆

నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారి 'సీతాకళ్యాణం' చిత్రానికి యిటీవలనే వాహినీ స్టూడియోలో ప్రారంభోత్సవము జరిగింది. ఇందులో శ్రీమతి అంజలీదేవి, శ్రీ యన్. టి. రామారావు సీతారాముల పాత్రల ధరిస్తున్నారు.

◆ ◆ ◆

రాజ్యం పిక్చర్స్‌వారి 'కృష్ణలీలలు' చిత్రం త్వరలో విడుదల కాబోతున్నది.

◆ ◆ ◆

సారధి ప్రొడక్షన్స్‌వారు 'కాళిదాసు' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఇందులో శ్రీ ఎ. నాగేశ్వరరావు. శ్రీమతి శ్రీరంజని ప్రధాన పాత్రల నిర్వహిస్తారని తెలుస్తున్నది.

◆ ◆ ◆

అన్నపూర్ణావారి 'మాంగల్యబలం' చిత్రం త్వరలో విడుదలకానున్నది.

———

# అంతరార్థం అర్థమైంది

శ్రీ ధాయిపులె బాలకృష్ణరావు

—(౦)—

నీలాకాశం వేపు నిరీక్షిస్తూ వుండిపోయాను. ఎందుకలా చూస్తున్నానో నాకే తెలీదు. చూస్తూ ఆలోచిస్తున్నాను అంటే అదిగూడలేదు. మరైతే, ఎందుకు ఆకాశం వేపు చూడ్డం? అయినా యీ ప్రశ్నకు సమాధానం తట్టలేదు. చూస్తూ ఆలోచించడం లేదు. ఆలోచిస్తూ చూడ్డంలేదు. కావున శిలా ప్రతిమనయ్యాను.

కపాలంపై పడిన ముంగురులకు చల్లటి వాయు వీచికలవల్ల చైతన్యం వచ్చినట్లుంది. నాట్యం ఆరంభించాయి.

రాము వచ్చి చాల సేపయి వుంటుందేమో. అయినా అతను నా ప్రతిమాకారాన్ని చూసి నన్ను పలకరించనూలేదు. "ఇదొక వెర్రిబాగుల లోకం" అనుకున్నాడు.

ఆ లోకంలో అలా యెంతసేపుండిపోయానో నాకే తెలీదు. రాము యిక వుండబట్టలేక తన మామూలు ధోరణిలో అడిగాడు.

"ఓరేయి సీను, పోయిందిరా" అన్నాడు.

"ఊ" అనగలిగాను, కొద్దిగా యీ లోకంలోకి వస్తూ,

"ఏమిటి రా! ఊ" మనసులో నవ్వుకొని మరీ అడిగాడు.

"నువ్వు చెప్పిందేరా. నే నేమైనా కల్పితం చేస్తున్నానా" అన్నాను.

"అది కాదుర నీకు మతిపోయిందిరా అంతే."

"అవునవును. పోక యింకా వుంటుందా. ఇన్ని గడ్డు సమస్యల మధ్య తారాడుతున్న 'ఆలోచనల రిసర్వాయిర్'కి 'రెస్ట్' అనేది వుంటేకదూ!

ఏంలోకంరా బాబు! బయటి కెళ్ళితే నానా బ్రహ్మాస్త్ర ప్రయోగాలు. నిన్న మీ ఇంటికి వచ్చేదోవలో 'పింజరి' వాళ్ళ వీధినుండి వస్తున్న. వాళ్ళ ప్రయోగాలు చూశావురా ఎలావున్నాయో! అరుగ మీదుండే వ్యక్తి నేను రావడం చూసి చెప్పడం ప్రారంభించాడు.

'ఓరే నాగిగా! చూశావురా ఆ అబ్బాయి బోలెడంత చదివాడు. కాయ కష్టం చేయడానికి కావల్సినన్ని కండలున్నయ్. ఏమైందీ! అటు వుద్యోగం లేదు, యిటు ఏమైనా పనిచేస్తున్నాడ అంటే అదీ లేదు. బికారిలాగ బేకార్ కొడుతున్నాడు - చెప్పే వాళ్ళులేక...' అంటూ ఒకే ధోరణిలో వాగడం. ఇది మెల్లిగపోతూ విన్నా. వాడి లెక్చరు పైన చెప్పినంతవరకు విన్నాను. ఇక వుండలేక తిరిగి వెనక్కి చూచాను. అంతటితో వాడు "గప్ చిప్" నాకు నీలకంఠుని కున్నట్లు మూడవ కన్ను నిజముగ వుండి వుంటే భస్మీపటలమై పోయేవాళ్లు. బద్మాష్లు!

మరోవైపు యెడతెగని ఇంటి సమస్యలు."

"ఇంటి సమస్యలతో నీకేం పనిరా, చూసేవాళ్లు చూసుకుంటారు. తల్లిదండ్రులున్నంతవరకు దిగులెందుకురా...పోతే, నీవేమైనా పెళ్ళిఅయిన వాడివా అంటే అదీలేదు. పెండ్లి అయివుంటే_

ఔరా! పాపం, భార్యపిల్లల్తో సతమత మౌతూ వేగలేక వేగుతున్నాడు" అనుకోవచ్చు. అలాంటి వేమి లేదుకదా ఇకపోతే, తిండి విషయమా అంటే అదేం కొదవలేదు.

హాయిగా నాకింకా" అంటూ పాట పాడ్తూ ఒక కాలుమీద మరోకాలు వేసుకొని తింటూ ఆనందానుభూతిని అనుభవింపవచ్చుము. ఇంక నీకు వచ్చిన లోటేమిటిరా ! "రాముకు తెలిసిందల్లా వెళ్లగ్రక్కాడు.

"ఓరే రాము! నీకు పైకి బాహటంగ కనబడే యీ పై చిల్లరవిషయాలే తెలుసుగాని లోతైన దృష్టి లేదురా. వ్యక్తుల మనః ప్రవృత్తులనుగాని వారి సాధక బాధకాలను గూర్చిగాని తెలిసికోడానికి నీకు అంతకంటే 'సైకలాజికల్' దృష్టిలేదు. కష్టాలకు

భార్యా పిల్లలే కారకులు కావలెనా నీ దృష్టిలో? తిండి తక్కువ కావడమే సమస్యకు కారణ భూతము కావలెనా? సమస్యలంటే యెక్కడికి సమస్యలు? చచ్చేంతవరకూ సమస్యలే. ఆదిమధ్యాంతరహితమై అలరారె సమస్య లెన్నో! అయినా, యీ సమస్యల పరిష్కారానికి మానవుడు కృషిచేస్తూనె వున్నాడు— జీవితాంతము. సమస్యలకు - మానవులకు అన్యోన్య సంబంధమువుంది. దీనికంతా కారణము - సృష్టి పదార్థాలు పరిమితంగా వుండడము, మానవుని కోరికలు అపరిమితంగా వుండడము.”

ఇదంతా రాము మౌనంగ విన్నాడు.

చీకటిపడింది. ఆకాశంలో నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి...

“బెజవాడనుంచి వుత్తరం వచ్చిందట—అది పెళ్ళి సంబంధాల వుత్తరం. రేపు వాళ్ళిక్కడికి వస్తున్నారు. అబ్బాయిని చూడ్డానికి. అయితే అబ్బాయికి యీ సంబంధమంటే పూర్తిగ విరుద్ధం. కాని, వాడి తల్లిదండ్రులకు యిష్టంగవుంది...ఈ సమస్య యెలారా తెగేది?” పరీక్షించేందుకు రాముని అడిగాను.

“అంతమాత్రానికే సమస్య ముడిని తీసుకు రావాలిరా! దాని నివృత్తికి మార్గం తెలీదూ! మీ నాన్న, అమ్మ చెప్పినట్లు చేసికోవడం మంచిది...మరి ఎందుకైనా మంచిది.” అదోలాగన్నాడు. వాడి జవాబు నాకు నవ్వు ఆపిందికాదు. రాము సమాధానాలు యెందుకలా వుంటాయంటే దానికి కారణం లేకపోలేదు. రాము యిలాంటి జీవిత సమస్యల్నిగాని, భవితవ్య పరిణామాలనుగాని, ఆలోచించి యెరుగడు, పరిణామాల పరిమాణాల్నిగూడ కొలువడు. రెండవదేమంటే, ఆస్తిపాస్తులు బాగున్నవాళ్లు కాబట్టి వాడికి యీ సమస్యల్ని గురించి బుర్రను వేడెక్కించడం అలవాటులేదు.

“నాయీసమస్య పరిష్కార ఫలితం ఏ రూపం దాలుస్తుందో భవిష్యత్తులో చూద్దువులే రాము! నేననుకుంటుండేది ఒకటి. తల్లిదండ్రులనుకుంటుండేది మరియొకటి. వీటికి పైగా విధిబలీయ ప్రమేయము వుంది. కాబట్టి యీ సమస్య పై మూడింటి మీద ఆధారపడివుంది. చివరికి యేది నెగ్గుతుందో?” అంటూ ముగించాను. రాముకిదంతా అవగాహనం కాలేదు. నా అస్పష్టమైన భావం రాము ఊహా శక్తికి అందని పండు. అందుకతను కష్టపడదుగూడ. అర్రులు చాచితే వచ్చేదేమంటాడు?

రాము నా దగ్గరనుండి శెలవు తీసుకున్నాడు. మరి, రేపటికి రమ్మన్నాను. సరే అంటూ చిరునవ్వుతో తలూపాడు. రాము చిరునవ్వు నాకు అదోలా తోచింది. “ఎప్పుడూ ఆలోచనలేనా” అన్నట్లు ఆ దరహాసపు తెర వెనుక భావము గోచరించింది. అయినా, ఇది మామూలేగా కడుపునిండి అవలించేవాళ్ళకు. రాము కలవారి అబ్బాయి. దిగులు లేదు, బుగులు లేదు. అసలు దిగులు పడవల్సిన గత్యంతరము ఏముందని? కావలసినంత ఆస్తివుంది. వాళ్ళింట్లో వుండేవాళ్ళేగాక, మరీ పదిమంది వచ్చి జీవితాంతము ఏ కాయకష్టము లేకుండ, తినినాగాని వుండే ఆస్తి కరగదు...

రేపటి కథ యెలా జరుగుతుందోరా బాబు అంటూ ఆలోచనా సముద్రంలో మునిగిపోయాను. అమ్మ పిలుపు వినబడింది. ముఖం మీద యెవరో నీళ్లు చల్లినట్లయింది అమ్మ పిలుపుకు. సోఫాలో కూర్చున్నవాడిని తీరాలేచి ఇంట్లోకి దారి తీసాను.

“అమ్మా...ఏమ్మా పిలిచావు” ఆప్యాయంగా అడిగాను.

“చూడు నాయనా! ఎలాగో ఒకలాగు నిర్ణయించుకో. తల్లిదండ్రుల మనసు కష్టపెడితే నీకేం వస్తుందని”

“అది కాదమ్మా పెళ్ళి చేసికోడం నా యిష్టమా, మీ యిష్టమా నువ్వే చెప్పమ్మా. ఇష్టములేని అమ్మాయిలను చేసుకొని బాగుపడిన వాడెవడైనా వున్నాడా?”

“అదికాదు నాయనా! చూడూ — మీ నాన్న ఎక్కడ పడితే అక్కడ అప్పులు చేశాడు—నీ చదువు కోసం. ఎలాగో, ఆ దేవుని ధర్మమా అంటూ నీచదువు పూర్తయింది. ఏదో యెక్కువ కట్నం యిచ్చేవాళ్ళ అమ్మాయిని చేసుకుంటే...” నా కళ్ళలో యెర్రజీరలు, కోపంతో రెండు పెదవులూ అప్రయత్నంగా

అడిగాను. సమంగా వుండే కనుబొమ్మలు 'బ్యాలన్సు' తప్పిపోయింది.

"చేసుకుంటే..." కోపంతో గట్టిగా అడిగాను.

అమ్మ అదిరింది. తడబడుతూ చెప్పింది.

"మీ నాన్నకు సంతృప్తి నాయనా! మొదటి సంబంధము—అంటే — బందరునుంచి వచ్చిన వాళ్ల అమ్మాయే కాదు, కుటుంబములోని వాళ్లంతా గౌరవ మర్యాదలు కలవాళ్లు. అందులోనే పుట్టి పెరిగారు. మంచిదే కాని నాయనా! వాళ్లు ససేమిరా ఐదు వేల కంటె యెక్కువ కట్నం యివ్వజాలమంటారు."

"అయితే యీ బెజవాడ వాళ్లు ధర యెంత పలికారో?" వ్యంగ్యంగా అడిగాను. ఇష్టంలేని వాటిని గురించి అంతకంటే మరోవిధంగ అడగలేకపోయాను.

"చూడు నాయనా! బెజవాడవాళ్లు ఇరవై వేలు యిస్తామంటూ మీ నాన్నకు వుత్తరము వ్రాశారు. మంచి సంబంధము; ఏదో అమ్మాయి యెడమకాలికి వాయియట. కొద్దిగా అడుగులు తడబడుతుంటాయి. చిన్నప్పుడు వాళ్ళనాన్న బెత్తముతో ఒక చిన్న దెబ్బ కొట్టగా, అలా వాయి వచ్చిందట. అప్పటి నుంచి అది అలాగే వుందట. అయినా,—ఏం బాబూ! మనకు కట్నం బోలెడంత వస్తుందిగా మాంచి సంబంధము బాబూ." అమ్మ పెదవులపై యెక్కడలేని చిరునవ్వు తొణికిసలాడింది. కాని అది భయాందోళనతో మిళితమై వుండే చిరునవ్వు అని స్పష్టమౌతూంది. అమ్మకు నే నేమనుకుంటానో అన్న భయమే అలాంటి చిరునవ్వును పుట్టించింది.

'అమ్మా, నాన్నవాళ్లు సంబంధాల్ని యే దృక్కోణముతో చూస్తున్నారో' నా కర్థమైంది. వీళ్ళ మాటల అంతరార్థం స్పష్టమైంది. సంబంధాల్ని విలువ కట్టేది కుటుంబ గౌరవ మర్యాదల్ని బట్టిగాని, అమ్మాయి గుణశీలాల్ని బట్టిగాని కాదు. డబ్బు... డబ్బు సంచులు యెక్కడి నుండైతే బరువుగా నెత్తిమీదికి వచ్చిపడతాయో ఆ వేపుకు వేలెత్తి చూపెడతారు—అటు వేపు యేమైనా వుండనీ.

"అంటే మీరు డబ్బుల్నిబట్టి సంబంధాల విలువల్ని కడుతున్నారన్నమాట. అలాంటి సంబధము నేను చచ్చినాగాని చేసుకోనమ్మా... నాన్నతో చెప్పు..." అంటూ కోపంతో బయటికి వెళ్ళబోయాను. నాన్న నా వెనకాలే నిలబడివున్నాడు. కోపంతో ముందుకు అడుగు వేయబోయాను. అయితే, వినయ, నమ్రతలు నా దారికి అడ్డుతగిలాయి. పెద్దలయెడ వుండే పూజ్యత, గౌరవము నాలో నశించలేదు. ఇక ఒక అంగుళము గూడ ముందుకు పోలేకపోయాను.

నాన్నను చూస్తూనే కళ్ళనుండి నీళ్ళు కారాయి. నాన్న కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి.-ప్రజల నేత్రాలనుండి ఆనందభాష్పాలు రాలాయి. నా బాధను అర్థంచేసుకున్నాడు కాబోలు

"సెభాష్! నీలాంటి కొడుకు నా కుండవల్సినవాడేరా! నీ యిష్టానుసారం కార్యసిద్ధి." అన్నాడు నాన్న-తడికండ్లను పల్లెవాటుతో వత్తుకుంటూ... నా ఆనందానికి అంతులేకపోయింది. నిజంగ, నాన్నను మనస్సులో అభినందించుకున్నాను.

నాన్న అమ్మతో చెప్పాడు.

"ఏమేవ్! నీ కొడుక్కు వున్నంత తెలివి నీకు లేకపోయిందే. ఆడవాళ్ళకు శీలము, వన్నె చెడని ఆభరణమే. ఈ శీలాభరణాన్ని చెడగకుండా, ఏ కళంకము రాకుండా జాగ్రత్త వహించడం వాళ్ళ పాలిటి ధర్మం. ఈ సత్యాన్ని మరచిన వాళ్ళకుగాని, విరుద్ధమైన వాళ్ళకుగాని తగిన ప్రతిఫలము ముట్టుతుంది. శీలము లేనివాళ్ళకు నెత్తిన యెంత బంగారు పెట్టితే మాత్రం వాళ్ళ విలువ యెంతే? కుక్కకు యెన్ని బంగారు తొడుగులు యెక్కించినా, యెన్ని వన్నె బట్టలు తొడిగించినా, కుక్క కుక్కే కదే!... ఈ రోజే బెజవాడలో వుండే నా ఆప్తమిత్రునివద్ద నుండి వుత్తరం వచ్చింది. రేపు రాబోయె బెజవాడ సంబంధము మంచిది కాదని, అమ్మాయి మంచిది కాదని వ్రాశాడు. ఇప్పుడైనా తెలిసిందా."

"ఇంక అర్థమైంది లెండి" అమ్మ తలూపింది. నాన్న చిలిపినవ్వు నవ్వాడు.

ఇరవై వేల కట్నము అంతరార్థము ఇప్పుడైనా అర్థమైంది గదా అని సంతోషిస్తూ, అక్కడినుండి భోజనాల గదిలోనికి ఆనందంతో యెగిరిపోయాను.




శ్రీ రమణలీల: 'కృష్ణభిక్షు' ప్రచురణకర్తలు శ్రీ రమణాశ్రమము. తిరువణ్ణామలై, (మద్రాసు స్టేటు) వెల రు. 3-50

భక్తి ముక్తి మార్గాలను ప్రబోధించిన దివ్యపురుషులలో శ్రీ రమణమహర్షి యొకరు. ఇందులో వీరి జీవితచరిత్ర, బోధనలు పొందుపరచబడియున్నవి. మానుషలీలాఖండము, శక్తిలీలాఖండము యోగలీలాఖండము, లలీలాఖండము, ఆశ్రమలీలాఖండము, నిర్వాణ లీలాఖండము, అమృత లీలాఖండముగా విభజించబడియున్న గ్రంథము శ్రీ రమణభగవానుల పవిత్ర జీవితచరిత్రతో బాటు ముక్తిమార్గములగు ఉపాసన, యోగసిద్ధిలాంటి అమూల్య విషయాలను వివరించుచున్నవి. ఆధ్యాత్మిక చింతను ప్రోత్సహించి దివ్యత్వమును యీ గ్రంథ పఠనము సమకూర్చగలదని రూఢిగా చెప్పవచ్చును. ఇందలి చిత్రములు మహర్షియొక్క, ఆశ్రమముయొక్క తను సువిదితము చేయుట కనువుగానున్నవి.

పవిత్ర సన్నివేశములు: అనువాదం-సంతపురి రఘువీరరావుగారు. ప్రకాశకులు: న సాహిత్యప్రచారసమితి, హైదరాబాదు. వెల 50 న. పై

భూదాన యాత్ర సందర్భమున శ్రీ వినోబాజీ స్వీయానుభవాలు, సంఘటనలు, సన్నివేశాలను యీ మున వివరించబడినవి. భూదాన యజ్ఞం పట్ల ప్రజలు — ముఖ్యంగా బీదలు సహృదయంతో చూపు క్తి, ఉత్సాహ వితరణలు బహు చక్కగా పొందుపరచబడినవి. భూదానోద్యమ వ్యాప్తికి యీ విశేషముగా తోడ్పడి ప్రజలలో గ్రామీణ అభివృద్ధి అభ్యుదయాలపట్ల ఆసక్తిని ప్రేరేపించ

**శ్రీ** లక్ష్మ్యష్టోత్తర శతనామ స్తోత్రము: తెలుగు వ్యాఖ్యాన కర్తలు స్వామి శుద్ధ చైతన్య. పుస్తకములకు శ్రీ రామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల (పోష్టు) ంటూరు జిల్లాకుగాని, చైతన్యపాఠశాల, ఆళ్ళగడ్డ (పోష్టు) కర్నూలు జిల్లాకుగాని వ్రాయవచ్చును. వెల 12 న. పై.

ఈ చిన్న పుస్తకంలో శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రముయొక్క మహిమ, నామావళి అర్థములు పొందుపరచబడినవి. పాపక్షయానికి, యిష్టకామ్యార్థ ఫలసిద్ధికి ధ్యానపూజా విధానములలో నుపకరించు యీ అష్టోత్తరమును ప్రతియొక్కరు యీ చిన్న పుస్తకం ద్వారా స్వీకరించగలరని ఆశిస్తున్నాము.

# సంపాదకీయములు

## సమగ్రమైన అభివృద్ధికి సహకారోద్యమము

జాతియరంగంలో సమగ్రమైన అభివృద్ధికి సహకార విధానము విశేషముగా తోడ్పడ[illegible] ప్రజలలో పరస్పర సానుభూతి సద్భావములు లేనిచో సహకారోద్యమము వర్ధిల్లజాలదు. సంఘ[illegible] సౌభాగ్యములకంటె వ్యక్తిగత లాభములు, శ్రేయో సౌభాగ్యములపట్ల ఆసక్తి చూపుతూ అధికార[illegible] దోపిడికి అలవాటుపడిన వర్గమువారు సహకారోద్యమమును ప్రోత్సహించరు. దానిఫలితంగా [illegible] కారోద్యమ లక్ష్యమైన ఉమ్మడిశ్రేయస్సు సమకూరదు.

వ్యవసాయ, వర్తక, పారిశ్రామిక రంగాలు జాతీయము కావడమునకు తోడ్పడునది సహకా[illegible] మము. ప్రజలు సహకారోద్యమ ఆదర్శ లక్ష్యాలను అవగాహనము చేసికొని సహకార సంఘ[illegible] స్థాపించుకొని చిత్తశుద్ధితో నిర్వహించుకుంటూ ఉమ్మడి శ్రేయస్సును తీర్చి దిద్దుకోగలిగినచో [illegible] దయ, అభివృద్ధులు మరింత సుగమంకాగలవు.

## సంఘసంస్కరణాలు - యువకుల కర్తవ్యము

బరోడాలో అఖిలభారత తృతీయ యువజన కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించిన ఇందిరా గాంధి దేశంలో సంఘసంస్కరణాలు అమలు జరుగడానికి, నూతన దృక్పథం కలిగించడానికి, అభ్యుదయాల గమనము త్వరితం చెయ్యడానికి యువకులు నిర్మాణాత్మకమైన శక్తిగా రూపొందాలని

దేశకాల పాత్రల ననుసరించి పూర్వాచారాలకు, సమ్మకాలకు స్వస్తి, జరిగి తీరాలి. దానిని నడవలేని సంఘం పురోభివృద్ధి గాంచలేదు. అందుకనే యువకులు ఉత్సాహంతో, ఆసక్తితో సం[illegible] రణలకు పూనుకొని జాతీయ పురోగమనాన్ని ప్రోత్సహించాలి.

సంఘసంస్కరణాలు అమలు జరుగడానికి యువతీ యువకులు తెంపు చేయడానికి కాని, అవ[illegible] త్యాగమునకుగాని శక్తిసామర్థ్యాలు, తెలివి తేటలు, ధైర్యసాహసాలతో వాతావరణానికి ఎదు[illegible] గాని అవకాశాలు మెండు. అందుకనే దేశంయొక్క అభివృద్ధి అభ్యుదయాల భవిష్యత్తు యువ ఆధారపడి యుంటుందంటారు.

## గోవధ నిషేధం

గోవధను నిషేధించాలనే ఆసక్తి ప్రతియొక్కరికి యుండతగినది. గోవు హిందువులకు పవిత్ర[illegible] కాక కామధేనువుగా మానవునకు నిత్యావసరాలైన ఆహారపానీయాలను సమకూర్చుచున్న శ్రమజీవి, త్యాగ[illegible] కూడాను. ఇట్టి దానిని మనము పోషించి, రక్షించవలసియుండగా దాని మాంసాని కాశపడి చంప ఘోరమునక తప్పదు. తనకు జీవయాత్రలో తోడ్పడుచున్న గోమాత పట్ల విశ్వాసము కలిగియుండవ[illegible] కాని యితర ఆహారవసతులున్నా గోమాంసానికి ఆశపడి గోహత్యను ప్రోత్సహించడము మానవుడు తన స[illegible] స్వభావమును కోల్పోవుటేయగును.

పాడిపంటలకు జీవనాడియైన పశుసంపదను పోషించుకొని తమ స్వీయసౌభాగ్యమునకు వినియోగించు కొనుట వివేకము కాగలదు. వయసుమీరిన గోవులను సయితము మాంసాని కాశపడి వధించడము [illegible] పాపమే కాకుండా కృతఘ్నత కూడాను.

గోవధ నిషేధం అమలు జరుగాలంటే ప్రభుత్వశాసనాలు రూపొందడము మాత్రము చాల[illegible] ప్రజలలో మానసిక పరివర్తనను కలుగజేసే ప్రచారము అత్యావసరము.


Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.